and bearing new ones, and again shedding them, like a stream of life endlessly-

The fruit wonders about the secret of this tree!

It bathes in showers of leaves that come down at the slightest touch of the wind, feeling the bliss and beauty of the falling leaves...

Maybe, fruit is the seer, who went into depths of meditation, to learn the inscrutable secret of life·

It sees life in death, otherwise how could death be so beautiful, is its enigmatic question!

Even a thousand seasons of spring, cannot achieve the grandeur and beauty of a single nude tree, which has renounced all its leaves and flowers···

Oh, i am bathing in beauty,
i swoon in the storms of subtle and deep pains which beauty inflicts on me.

O what a tree! this standing grandeur, where is its secret?- So thinks the fruit hanging to the tree.

It realises before it drops from the branch that the seed of the tree is inside itself and that the *I* of the fruit is no other than the *I* of the tree...

The earth is a natural museum into which generations of flora and fauna set; and our children the wingless birds also set, like rays of evening sun-

ఏమిటి ఈ చెట్టు! ఈ నులోచ్చేఉన్న మహాసౌందర్యం! దాని రహస్యం ఎక్కడుంది?

చివరకు రాలేముందు తెలుసుకుంటుంది ఆ పండు, చెట్టు గింజ తన కడుపులోనే ఉందనీ, చెట్టనుకునే "నేను" పండనుకునే "నేను" రెండూ ఒకటే అనీ!

ధరిత్రి ఒక సృష్టిప్రదర్శనశాల-పశువులు, పక్షులు, వృక్షాలు మట్టిలోకి అస్తమిస్తాయి తరాలు తరాలుగా; రెక్కల్లేని పక్షుల్లాంటి మన పిల్లలుకూడా అందులోకే అస్తమిస్తారు సాంధ్యకిరణాల్లా...

కొత్తపిల్లలు ఉదయిస్తారు కొత్తగర్భాలకూ కొత్త విత్తనాలకూ కొత్త కాంతివలయాలు విరిసే ముఖాలతో...కొత్తనాగరికత లల్లుతారు చరిత్ర పేజీలకందిస్తారు; పేజీలు పెరుగుతుంటాయి వాటిమీద నిర్దాక్షిణ్యంగా కాలపు గండ్రగొడ్డలి పడేవరకూ.

చరిత్రలో చెమట ఒక శాశ్వత అంతర్వాహినిలా ప్రవహిస్తూ ఉంటుంది; మానవ యంత్రపు కండరాలు బ్రహ్మాండమైన కొయ్యచక్రాల్లా తిరుగుతుంటాయి నిర్విరామంగా కిర్రు కిర్రుమంటూ తినటానికి గ్రీజుకూడా లేకుండా-ఈ ధగ ధగ మెరిసే నిరర్థక ఉపరినిర్మాణాన్ని నిలబెట్టడానికి,

చరిత్ర చాద స్తపు ముసలిది, పురాతన గొంతు సవరించుకుంటూ, కంఠస్వరం ఒక గగనఘంటలా సారించి ఇతిహాసాలంటూ చెపుతూంది మనిషి కథల్ని అనాదికాలంనుంచీ. దాని శ్వేత కేశాలమీది సానుభూతిచేత అన్నియుగాల్లోనూ ఆ కథలు వినే మనుషులుంటారు.

ప్రదర్శనశాల నిండుతూ ఉంటుంది ఖాళీ అవుతూఉంటుంది; గుంపులు వస్తూఉంటారు గుంపులు పోతూఉంటారు విశాల ప్రదర్శనశాల హాలుల్లో సాగిపోతున్న గాలుల్లా-అగమ్య ప్రయాణంకోసం నిరంతరం తహతహలాడే గాలుల్లా-ఎప్పుడూ దర్శించని ఎన్నడూ

And sons of new generations rise from new wombs and new seeds, with new faces, surrounded by new orbs of light only to weave new civilisations, for the pages of history, which keep bulging, until the axe of time descends on it mercilessly

Sweat flows as an enternal under-current of history, the sinews of human machine work, to make this glittering superstructure remain, constantly creaking like a gigantic wooden wheel, never at rest and never fed with grease-

History, the stupid old woman, works up her hoary voice in tremulous tones, to narrate the epic tales of man from the beginnings of time, while out of sympathy for her greying reason, men listen in all times-

The museum is filled and emptied; crowds pass in, and pass out through the halls, like moving winds restless for an unbounded journey, for peaks unseen, unknown but dreamt of generation after generation by the eyes of trees, animals, men and molluscs; while the drums of armies, goverments, judicatures, dictators and demogogues continue sounding their empty fanfares

O each age hungers for a passion, each age invites the rule of a stupid theory, willingly subjects itself to its sovereignty, while the intellect remains critical, watching and hatching the eggs of a new age.

ఎరగని. కానీ తరతరాలుగా మనిషినించీ పశుపక్షిక్రిమికీటకాల వరకూ నిరంతరం తెలీకుండా కలలుకంటున్న ఏవో శిఖరాలవైపుకు సాగిపోతున్న తరాల గాలుల్లా-మరోవైపు సైన్యాలు ప్రభుత్వాలు న్యాయస్థానాలు నియంతలు జనతంత్రవాదులు ఇత్యాదులు వారి శూన్యపటాటోపధంకాలు బజాయిస్తుంటారు.

ఓహో! ప్రతియుగమూ ఒక వెర్రి ఆకాంక్షకోసం ఆకలితో అరుస్తూ ఉంటుంది; ప్రతియుగమూ ఒక మూర్ఖసిద్ధాంతపు పరిపాలన్ని ఆహ్వానిస్తుంది. దాని సార్వభౌమత్వానికి హృదయపూర్వకంగా లొంగుతుంది. బౌద్ధిక శక్తిమాత్రం అనుమానంతో చూస్తూ ఉంటుంది మరోయుగపు గుడ్లు పొదుగుతూ—

Poetry is coming like a red red horse

Like an arrow from my blood, like the life of a martyr! It is not letting me breathe!

From the vast glass-pane of hotel *Ashoka*, are coming, turning into words, all those trees, all those roads that run through the trees, all those people that the roads carry, all these loads of skies that the people bear, and all those horizons that hang from the skies, helplessly-

Every moment of mine, comes and goes, chistling itself into a sculptured piece,

One time as my nation, another time as my song, yet another time as my poem, and then as my blazing sun.

With new faces, wearing new halos of light my poems come, jumping and dancing on the new lines of my eyes.

On my roads are written letters of welcome; on my footsteps are rained colours by roadside-trees.

Some children are playing marbles, out there-Those very marbles which they play today, will ascend the guns of tomorrow and destroy these gigantic edifices of oppression,

They shall raise new buildings and new sunrises will be born in the hills.

Can ranges of mountains stop the dawn?

కవిత్వం ఎర్రగుర్రంలా పరుగెత్తుకు వస్తోంది-రక్తంలో మునిగిన బాణంలా పీరుడు విడిచిన ప్రాణంలా!

నన్ను ఊపిరితిప్పుకోనీడంలా......

హాటేల్ అశోకా విశాల కిటికీగ్లాసులోనించి

మాటలుగా మారి వస్తున్నాయ్ చెట్లూ, చెట్లగుండాపరుగెత్తే రోడ్లూ, రోడ్లుమోసే జనులూ, జనులుమోసే ఆకాశాలూ, ఆకాశాల నుంచి హాహాకారాలు చేస్తూ వ్రేలాడే దిగంతాలూ...

నా క్షణం ప్రతిదీ ఒక శిల్పంగా మలుచుకుని వస్తోందీ పోతోందీ ఒకసారి నా జాతిగా ఒకసారి నాగీతిగా ఒకసారి నా కవితగా ఒక్కొక్కసారి నా జ్వలించే సవితగా!

కొత్తకొత్త ముఖాలతో కొత్తకాంతి మండలాలతో వస్తున్నాయి నా నూతన దిగంతరేఖలమీద గంతులువేసుకుంటూ...

నా రోడ్లమీద స్వాగతాక్షరాలు రాసిఉన్నాయి, నా అడుగుల మీద చెట్లు రంగులువర్షిస్తున్నాయి...

దూరాన ఎవరో పిల్లలు గోలీకాయలాడుకుంటున్నారు. ఇవాళ ఈ పిల్లలు ఆడుకునే గోలీలే రేపు బందూకు లెక్కుతాయ్, బ్రహ్మాండాలు బ్రద్దలుచేస్తాయ్; కొత్తబిల్డింగులు కడతాయ్ కొండల్లో కొత్తసూర్యోదయాలు పుడతాయ్...

పర్వతశ్రేణులు ప్రభాతాన్ని ఆపగలవా! సూర్యుడు వేయి ఖడ్గాలతో ఛేదించుకుంటూ దూకుతాడు; అన్ని కొండలమీదా ఎర్ర కాంతుల జెండాలు నాటుతాడు-

మెరిసే మోటారుకార్లని వీపులమీద వేసుకుని మోసే ఈ రోడ్లన్నీ చెట్లగుంపుల్లోపడి పారిపోతాయ్.

నేను పోతే పోతాను, మళ్ళీ రాకపోవచ్చు; కానీ నా జ్ఞాపకాల బారినించి తప్పించుకోలేరు మీరు; అవి ఈదేశపు గాలుల్లో పక్షులై పాడుతుంటాయ్, కిరణాలై అల్లుకుంటాయ్.

Sun will any how jump forward, cutting across with a thousand swords; he will plant red flags of light on all the hills-

These shining roads, which today are bearing on their backs rolling motor cars, will flee away through these crowds of trees...

I may go and i may not return; but there is no escape from my memories; they shall sing forever becoming birds in the air, they shall become a million rays of light and spread a net on my people.

Don't i know my child

What sea is roaring in that tiny drop of your tear; and that is why i shout my appeals to the trees, 'you bear weapons and not leaves on your branches,'–

Rocks along my way, entreat me for voices, voices, voices–

Chariots of experience roll over my chest; though the flesh of my body is crushed under the weight of their wheels, i stand staring at the clouds of thoughtful dust left behind.

i dropped everything as a tree drops its flower.

I cannot explain how powerful is the beauty that comes out of renunciation!

It is only when i can change my age from youth to childhood, or from childhood to old age, from one to another, and summon at *Will*, the spirit of the years of any part of the life given

బాబూ! నీ చిన్ని కన్నీటిబిందువులో ఏ సముద్రం గర్జిస్తూ ఉందో నాకు తెలుసు; అందుకే నేను చెట్లతో మొరపెట్టు కుంటున్నాను, "ఆకులుకాదు తుపాకులు కాయం," డని-

నా దారిలో రాళ్ళు అడుగుతున్నాయ్ "గొంతులు, గొంతులు మాకు గొంతులు" అని-

నా గుండెలమీద పరుగులెత్తే అనుభవాల రథచక్రాలక్రింద నా శరీరపు కండలు నలిగిపోతున్నా అవి రేపే భావాల మేఘాలు చూస్తూ నిర్విణ్ణుడుగా ఉండిపోతాను

నేను నా సర్వస్వాన్ని రాల్చుకున్నాను, చెట్టు తన పువ్వును రాల్చుకున్నట్లు;

పరిత్యాగంలో ఉదయించే అందం ఎంత అందమయిందో చెప్పలేకున్నాను-

వృద్ధుడ్నయినా యువకుడ్నిగానూ, యువకుడ్నిగా ఉన్నప్పుడు శిశువుగానూ లేక శిశువుగా ఉన్నప్పుడు వృద్ధుడ్నిగానూ మారగలిగినప్పుడు, నాకిచ్చిన జీవితంలో ఒకదానినించి మరొక దానికి అవస్థలుమార్చే శక్తి నాకుందని తెలుసుకున్నప్పుడు నేను అజేయుడ్ని. అంతకుముందు జీవనమరణ తీరాలమధ్య మునిగి పోతున్న ఓడను, ఓడిపోతున్న జీవిని-

నా కోర్కెలు శిఖరాలమీద నులోచ్చేఉన్న దేవాలయాలు; నేను నేలమీద నడుస్తున్న బాటసారిని

ఎక్కడికో నిశ్శబ్ద నిశీథకుహరంలోకి పోయి ధ్యానం చేసుకుందామని ఉంది, ఎవ్వరూలేని దేవాలయానికి-చివరకి నా ఏకాంతానికి భంగం కలిగించే దేవుడుకూడా లేని దేవాలయానికి!

to me, only then i become unconquerable; before that, i was only a ship, sinking between the peaks of birth and death.

My *desires* are temples erected on the peaks of hills. I, a traveller, trecking my way on earth.

I am longing to vanish into the womb of midnight-silence, to pray, into the temple where there are none, Not even the god to disturb my solitude.

To achieve this one unique word you donot know how much, how hard i had to dig into my soul.

I ran with the flying birds, offering marks of blood to the earth with my wounded feet.

I joined the monks of flowers and immersed in the colours of deep penance, in the forests; shoulder to shoulder practised hoarse voices with wild winds, that come rubbing their skins to the *Arctic* regions;

blew off myself into-the wide seas, mixed up with unruly cyclones; made at last the lap of hills into my temple and became god.

Then, all the sounds of creation came, with halos around their heads, crowded the blue roads of the sky, looking at me with strange satisfaction.

But, i am now immersed in pure silence.

It is so profound that no one can comprehend my condition.

For me now, there are no sunrises, there are no sunsets, there are no colours, there are no melodies.

ఇంత అందమైన ఒక్క మాట పొందడానికి నా ఆత్మను ఇనప గునపాలతో ఎంతలోతులకు త్రవ్వానో నీకు తెలుసా?

ఎగిరే పక్షులవెంబడి పరుగులెత్తాను భూమికి నా కాళ్ళ గాయాలతో రక్తాంకితా లర్పిస్తూ

పూల భిక్షువుల్లో కలిసిపోయి ఆకవుల రంగుల్లో మునిగి తపస్సులు చేశాను

ఆర్క్టిక్ భూములకు తమ శరీరాల కండరాలు రుద్దుతూ వచ్చిన హోరుగాలులతో భుజాలుకలిపి బొంగురుగొంతులు అభ్యసించాను

కఠోర తుఫానులతో నన్ను కలిపి ఊదేసుకున్నాను సముద్రాల్లోకి

కొండలఒడి గుడిగా చేసుకుని చివరకు దేవుడ్నయ్యాను

ఇప్పుడు శబ్దాలు శిరస్సులిన్న వెల్తురు బింబాలతో అలంకరించుకుని గుంపులు గుంపులుగా ఆకాశపు నీలివీధుల్లో నిలిచాయి. నన్ను ఒక వింతసంతోషంతో చూస్తూ—

కానీ నేనిప్పుడు నిశ్శబ్దంలో మునిగిఉన్నాను. ఈ నిశ్శబ్దం ఎంత నిశ్శబ్దంగా ఉందో ఎవ్వరికీ తెలీదు; నాకిప్పుడు సూర్యోదయా ల్లేవు సూర్యాస్తమయా ల్లేవు, రంగులు లేవు రాగాలు లేవు; ఇంద్రియాలెరిగిన అనుభూతులేవీ లేవు-

ఈ తరుణం నన్ను పిండి నీకిచ్చినదే ఆ బరువైన అర్థపు వేడి బిందువు!

కిరణాల అడవుల్లో పరుగెత్తుతూంటే అవి గుచ్చుకుని నా ఒంటినిండా ఎర్రటి గాయాలు!

నిండు వసంతంలో ఒంటరిగా ఒక చెట్టు ఒక పెద్ద కన్నీటి బిందువు రాల్చింది; ఆ చెట్టు అలసిన నా శరీరంమీద ఒకనాడు ఒక నీడపట్టింది.

There are no experiences known to any of the human senses.

It is this moment that sqeezes me, and offers to you,

The heavy hot drop of a rare meaning...

In the forest of rays, i was badly bruised running,

sharp rays pierced into the flesh all over my body

There, a lone tree, in full spring, dropped a huge tear. That tree had spread its shade

once, over my tired body.........

Flowers are bound to bloom on the limbs of the trees one day; my country should chop the hands of butchers, who fell trees and run a saw into their bodies.

Birds sing thoughts of the trees, poet sings thoughts of the brids......

All do not know, only the branch which-lost the cuckoo knows what spring is, and only the birds which lost their songs-

Spring is not the same spring, which everybody believes; it is a season when flowers sigh heavily.

The bird can fly away, but where can the tree go? Even when cyclones beseige, it stands rooted to the earth in determination, Its life dedicated to the soil;

like me, clinging to my country, though I donot possess one inch of land in it.

ఎప్పటికయినా చెట్ల అవయవాలమీద పూలు పూస్తాయి; చెట్ల శరీరాలుకోసే కసాయివాడి చేతులు నరకాలి నా దేశం!

చెట్ల భావాల్ని పక్షులు పాడుతాయి, పక్షుల భావాల్ని కవి పాడుతాడు.

వసంతం అంటే అందరికీ తెలీదు! కోకిలల్ని కోల్పోయిన కొమ్మలకే తెలుసు పాటల్ని కోల్పోయిన పక్షులకే తెలుసు...

వసంతం వసంతం కాదు, పూలు నిట్టూర్పులు విడుస్తున్న ఋతువు—

పిట్టయితే ఎగిరిపోతుంది, చెట్టు ఎక్కడికి పోతుంది? తుఫానులు చుట్టుముట్టినా ఆ నేలకే అంకితమై ఉంటుంది— వేళ్ళతో ధరిత్రి పట్టుకుని; సెంటు భూమిలేకపోయినా ఈ దేశాన్ని అంటి పెట్టుకోనిఉన్ననాలాగే.

ఎప్పుడు ఆకు రాలిపోతుందో గాలికికూడా తెలీదు.

భ్రమరాలు పూలదగ్గర సెలవు తీసుకుంటున్నాయి.

మా ఊరికాలువ ఎక్కడో పొదల్లోకి పోయి నిద్రిస్తుంది. నేనూ అక్కడికే పోతా—

నీవు తెలి ఉషస్సులు తలలో అలంకరించుకుని వస్తూఉంటే నాలో ఆపాదమస్తకమూ ప్రణయకూలంకషలు పరుగులిడుతాయి. నా రక్తాణువులన్నీ ముందుకు దూకుతాయి, నా నూతన సూర్యుడివైన నీ బాహుమండలంలో లీనం కావడానికి—

మనిమిద్దరం కలిసి మనోఃఅపుల్ని మన ప్రియతమ దేశపు తలపులతో కలుపుదాం; మనం పరస్పరం కనే కలలు మన మహా ప్రజల వక్షస్సీమల్లో ఒక నూతన పరిమళాల యుగాన్ని ఆవిష్కరింపనిద్దాం;

నేను ప్రజల యుద్ధాల్లో మరణించినా అది నీ ఆశయాల ప్రపంచంకోసం చేసిన ప్రాణదానమే, నా మృత్యువు రేకుల్లోనించి నా అమరత్వాన్ని ఉన్మీలనం చేయడమే—

Even the wind does not know when the leaf falls. Bees are bidding farewell, to flowers, and the stream of my village meanders away far, far into distant bushes, to sleep.

Come, my feet, take me there.

When i see you come decked with dawns O love! my whole being is excited at the sight and my blood leaps to join you, my new sun-

together let us weave our love into the fabric of our great country;

the dreams that we dream for each other, spread a scent around and wake up a whole era of desires in the bosom of our nation;

I die for you, only to celebrate my immortality in death, in the wars of my people.

How can I forget you? even in the midst of the fiercest storms that I as my country's soldier must endure, walk through rugged mountains and forests, to the farthest fringes of our borderlands.

I, my darling, learnt my love in the school of your arms, only to love my people and my country and through you I shall die a thousand deaths at every step, to reach the altar of my nation's progress.

On the green lawns of your bosom, I spread my rays of warmth, only to hold a glorious picture for the lives of my beloved people, so that they may weave into the miseries of their lives the silken threads of sentiment and feeling, and to

నిన్నెలా మరచిపోగలను ప్రేయసీ? నాదేశపు సైనికుడ్నిగా భీకర తుఫానుల్లో పోతున్నా,

దుర్గమ పర్వతపంథాల్లో నడుస్తున్నా శిఖరస్కంధాలు అధిరోహిస్తున్నా,

అరణ్యాల పేగుల్లో దాగిఉన్నా దేశపు చివరిఅంచుల్లో ప్రాణాలు విడుస్తున్నా నిన్నెలా మరచిపోగలను?

ప్రియతమా! నీ బాహువుల పాఠశాలలో నేను నేర్చుకున్న ప్రేమ నా దేశపు నేలల్ని, నదుల్ని, అడవుల్ని, పశువుల్ని, పక్షుల్ని ప్రజల్ని ఇక్కడి గాలినీ నీటినీ ప్రేమించడానికే. నీవు నాకు ఉంటే, అడుగడుగునా వెయ్యి వీరమరణాలకు నన్ను విసిరేస్తాను అవలీలగా, నాజాతి అభ్యుదయంకోసం అలంకరించిన బలివేదిక చేరడానికి-

నీ వక్షస్ శాద్వలసీమ మీద నా కవోష్ణ కిరణాల హిరణ్యం వెదజల్లుతాను; నా జనుల జీవిత కుడ్యాలకు మన ప్రేమగాథలతో ఉజ్జ్వల తైలవర్ణ చిత్రాలు తగిలిస్తాను- వాళ్ళ పేదబ్రతుకుల కథా నికల్లోకి ప్రేమలో తడిసిన హేమతంతువులు అల్లుకుంటారని, ఇతిహాసపు గుమ్మానికి ఇంద్రధనుస్సులు వ్రేలగడతారని-

చూడు ప్రేమరాశీ! ఆకాశంలో ఆ మేఘాల సమూహాలు... అవి ప్రాచీన కావ్యాల్లోలా ప్రేమసందేశాలు మోసుకురావడంలేదు, నవ పవనాల శ్వాస మోసుకువస్తున్నాయి మన జనులు పీల్చడానికి-

మన చూపులు కలిశాయి, నా కన్నులు నిదుర విడిచాయి నా ప్రజల కలల్లో కాంక్షల్లో కలిశాయి

ఈ భూమండల మార్గాల్లో ఒంటరిగా నడవలేను;

నా బ్రతుకు వెయ్యి విధాలుగా నీవనే ఒక నాజూకు నూలు పోగుల జాలంతో అల్లిన దుకూలం-

భార్యగా, నెచ్చెలిగా.

ప్రేయసిగా,

మాతృదేవతగా, చంటిబిడ్డగా,

ఒకటేమిటి నా సర్వస్వంగా-

my nation, a colourful tapestry to the walls of history.

Look at those clouds, what tidings they bring to us, not the tidings of love in the classical fashion, but the breath of new winds, with which you and i will feed our people.

Our eyes met and my sleep left to wander in the valleys and meadows of my nation's dreams and aspirations. I cannot treck this land alone; in my exsistence you are woven like a delicate yarn in a thousand ways,

as my wife, my friend, beloved, my mother, my sister, my child and everything. You give me the strength to travel the distances that are ahead of me and together we achieve our, and our people's goal.

నా ముందున్న దూరాలు దాటడానికి నాకు కావలసిన బలాన్ని ఇస్తావు నీవు; మనిద్దరమూ కలిసి మన ప్రజల అంతిమ సమరాన్ని గెలుస్తాము.

O melody, hear me......

By what good luck I do not know, a moment of vision came to me like a comet in the sky-vision of cruel facts of life.

Now, don't cheat me by your charms and infatuations. Don't make me forget my pains.

If I were to forget, all those that have to be exploded with these very hands, will remain safe and secure, with a longer lease of life.

O flowers and birds ! hold your tongues, close down your voices, let me snatch my weapons.

Let me wake up those minds which are sleeping snugly in that unbearable stink.

Let them be turned into violent winds.

Let me teach them the art of hatred. Let me preach them how sacred is hatred. Let me bestow on them with all the power of my blood, the sacred gift of awakenment to hate.

Whether left in the air, or bound on paper, let these words plant volcanoes in them, let my volcanoes burst; don't stop this sacred explosion.

The green parrots which i try to catch here with silken threads of thoughts, escape, into families of trees wounded by the hands of merciless storms.

Life here, aborts, discharges dreams, with undeveloped limbs and ugly shapes; these, some

ఓ గీతికా! విను—
ఏ పుణ్యం చేసుకున్నానో ఉల్కలా వచ్చిన
ఒక్క క్షణం కాంతిలో
జీవన కఠోర సత్యదర్శనం చేసుకుంటున్నాను;
నీ మోహినీత్వంతో నన్ను మోసంచెయ్యకు
నా అపూర్వసంపదలాంటి ఈ క్షణాన్ని దొంగిలించుకొని పోకు,
నా బాధల్ని మరచిపోనీకు—
మరచిపోతే, నాచేత బద్దలుకావలసినవన్నీ క్షేమంగా ఉండిపోతాయ్
హేయ్! పువ్వులూ పక్షులూ! మీ గొంతులు కట్టిపెట్టండి
నా తుపాకి నన్ను తీసుకోనీండి
అసహ్యతని సహిస్తూ నిద్రిస్తున్న మనస్సుల్ని మేల్కొల్పనీండి; వాటిని భయంకర ఝంఝూమారుతాలుగా మార్చనీండి
ద్వేషించే విద్య నేర్పనీండి
ద్వేషం ఎంత పవిత్రమైన వస్తువో బోధించనీండి; ద్వేషించడానికి కావలసిన స్పృహని నా రక్తంతో దానం చెయ్యనీండి—
గాలిలోఉన్నా కాగితా లెక్కినా ఈ మాటలు వాళ్ళలో అగ్నిపర్వతాలు నాటనీండి
నా అగ్నిపర్వతాలు పగలనీండి
ఈ పవిత్ర ఆత్మవిజృంభణాన్ని ఆపకండి

నేను ఇక్కడ పద్యాల సిల్కుదారాలతో పట్టుకుందామనే చిలకల గుంపులు, తుఫానుల చేతుల్లో గాయపడ్డ వృక్షాల కుటుం

vulture carries by the beak to the hill-tops, eats and vomits them, upon the people, calling them poems-

The child within the womb, better remain in the womb in this land of ours; for, if it comes out and complains of hunger, he will be shown the foot-paths and not the fields where the food grows:

Here, even the sun falls out of the womb of every night, a shapeless lump of flesh.

My days limp like colonies of lepers, my dreams of future hiss and strike their fangs into the flesh of my present nights.

Days of my country are boats that dash against rocks and break, nights are worries that touch the heart and burst into flames.

O ! today i am a ferocious dragon, made with the hands of the repulsive puss oozing from the body of my land.

The red fox, in the trees of my mind, keeps on stirring, in and out of the thickets making constant reconnoitres at something. Eyes burning like coals in the darkness for its unseen goal. It punctuates my thoughts, interjects commas, colons, interpolates hyphons, never introduces a full stop. It brings more ideas from the sideways and savannahs and swells up the procession of my thoughts, arms them up with passionate emotion and waits to see the procession burst out into

బాల్లో వాలుతున్నాయి; ఇక్కడ జీవితానికి గర్భస్రావమై, కలలు అసహ్య రూపాలతో అసమగ్ర అవయవాలతో బయటపడి పోతున్నాయి

ఎవడో పద్యాలు రాసే పక్షి వాటిని ముక్కున కరిపించుకుని పోయి కొండ శిఖరాలమీద పెట్టుకుని తింటున్నాడు!

ఇక్కడ గర్భంలో ఉన్న శిశువు గర్భంలోనే ఉండిపోవాలి

ఈ దేశంలోకి వచ్చి ఆకలి అని ఏడిస్తే ఫుట్‌పాత్‌లు చూపిస్తారు పొలాలు కాదు-

ఇక్కడ సూర్యుడే రోజూ రాత్రుల గర్భంలోనించి ముక్కూ మొహమూ లేని రక్తపిండంలా ఊడి పడుతుంటాడు

ఇక్కడ నా దినాలు కుష్ఠురోగుల్లా కుంటుతున్నాయి నా భవిష్యత్ స్వప్నాలు నా ప్రస్తుత రాత్రుల్ని కాటువేస్తున్నాయి—

నా దేశపు దినాలు రాళ్ళకు తగిలి పగులుతున్న పడవలు;

నా దేశపు రాత్రులు గుండెకు తగిలి పగులుతున్న గోడవలు...

ఈనాడు నేను నా దేశపు పుండ్లనించి కారుతున్న చీము తయారుచేసిన పగబట్టిన పాము!

ఆ ఎర్రనక్క ఎప్పుడూ మెదులుతూ ఉంటుంది నా మది పొదల్లో- ఏదో ఒక లక్ష్యంమీదికి దూకుదామని ఉద్యమిస్తూ ఉంటుంది; కనపడని గమ్యంకోసం కళ్ళు కణ కణలాడుతుంటాయి చింత నిప్పుల్లా

అది నా ఆలోచనల్లో కామాలు పెడుతుంది సెమికోలన్లు ఇరికిస్తుంది, కానీ పులుస్టాపులుమాత్రం పెట్టదు. అడవుల గొడవల్లోనించీ పచ్చికబయళ్ళలోనించీ కొత్త కొత్త భావాల్ని తీసుకొస్తుంది, ఉద్రేకంతో వాటికి ఊపిరిపోసి అస్త్రశస్త్రాలు చేతికిచ్చి నా ఊహల సమూహాల ఊరేగింపును మరింత ఉధృతం

plains like an unshackled sea, wild and uproarious. The red fox which feeds my mind with flames, moves like a fluttering red rag, with sinewy legs against the storms that blow over as enemies of-countries, continents and nations.

Who created this red fox ? Is it the two coals that flickered in the thickets of a head, a beard and whiskers ? But i am sure it is not Doulton of England !

Some bird from somewhere comes on wings, drops a song in my ears and flies away

A line which conveys a real experience, comes to you like a bird with a life and a song... yes a life and a song !

Yes, this is the land where millions of stones live, forlorn by their families of hills.

This is the land crushed under the iron heels-of gruelling sun.

This is the land which spits flames of mirages from her bloody wounds-

This is the dancing hall of the reckless flames of sun's fury.

This is the land which is deserted by all living beings, leaving it to the enormous void, spreading from one end to the other end of sky.

Here, nothing exsists except a bird and a tree

చేస్తుంది; ఊరేగింపు సంకెళ్ళు తెంచుకున్న సముద్రంలా గర్జిస్తూ మైదానాల్లోకి దూకాలని చూస్తూ ఉంటుంది.

నా మనసుకు మంటల ఆహ్వానం వేసే ఆ ఎర్రనక్క రెప రెపలాడే ఒక ఎర్ర గుడ్డపేలికలా ముందుకు నడుస్తుంది తన బలిష్ఠమైన కాళ్ళమీద; ఎదుర్కొంటుంది ఖండాలు దేశాలు జాతుల మీద వీచే శాత్రవతుఫానుల్ని-

ఎవరు సృష్టించారు ఈ ఎర్రనక్కని? జుట్టూ జుల్ఫాలూ గడ్డమూ మీసాలూ దట్టంగా ఆవరించిన పొదలాంటి ఒక మొహం లోనించి మెరిసే రెండు నిప్పుకణికలా?

ఇంగ్లండులో ఉన్న డౌల్టన్స్ మాత్రం కాదు—

ఒక పక్షి ఎక్కడ్నించో వస్తుంది రెక్కలమీద, ఈ బాట సారి చెవిలో ఒక పాట పడేసి వెళ్ళిపోతుంది

ఒక నిజమైన అనుభూతిని మోసే వాక్యం పాటా ప్రాణమూ మోసుకొస్తున్న పక్షిలా నీ దగ్గర వాలుతుంది తెలుసా!

ఇది కొండల్ని కోల్పోయిన కోట్లాది రాళ్ళు నివసిస్తున్న నేల

ఇది ఎండల ఇనప మడమలక్రింద నలుగుతున్న నేల

తన గాయాల రక్తజ్వాలల్ని ఎండమావులుగా ఉమ్మి వేస్తున్న నేల

ఇది ఎండల క్రోధాగ్నికి నర్తనశాల; దిశనించి దిశవరకూ వ్యాపించిన శూన్యానికి తనని వదిలివేసి సకలప్రాణులూ పారి పోయిన నేల-

ఇక్కడ ఒక పిట్టా ఒక చెట్టూ తప్ప మరేమీ లేవు

The tree is perhaps the one who lost his way, from those families of trees, which migrated to distant lands, in search of water.

Like the tear of the tree, is the lonely tiller with his plough; alone wrests the life- substance from out of this niggardly rocky soil.

O ! the arrogant sun rubs its muscles on the cheeks of the tree. From what countries do they come, these exiled whirlwinds, to take refuge here? who said they are rocks? they are consciences who gagged their mouths with their hands.

Who said they are flames of the sun ? They are armies of fire, invading on helpless rocks. To history with me, these rocks also gave their blood. Today they are mere rocks, but the sculptures of- bygone empires were their dreams.

O toiler, over there with a plough in your hand, you are not alone, Your jonrney cannot halt merely as a drop of tear. There is another brother who joins his footsteps with every one that you tread on these stones, in other parts of the earth, remember-

In Iraq, in Iran, in Mexico, in the far East or Mongolia-

over these roughlands, flowing with tears of rocks,

A man will rise one day over whose body iron muscles move as whirlwinds.

See, the ranges of mountains, how silently they move in the distance, draping their shoulders with 'uparnas'* of sun ; they are prophets,

* 'uprna' in Hindi and Marathi is the word for upper cloth used by men on their shoulders.

పరభూములకు నీళ్ళకోసం వెతుక్కుంటూ వలసపోయిన చెట్ల కుటుంబాలనించి తప్పిపోయిన చెట్టేమో అది

ఆ ఒంటరి చెట్టు కార్చిన కన్నీటిబొట్టులా నేల దున్నుతున్నా డొకడు, రాతినేలలో నించి జీవనధాతువు పిండుతున్న వీరుడు...

చెట్టు చెక్కిటిమీద రుద్దుతుంది తనకండ ఇక్కడి పొగరు బోతు ఎండ;

ఏదేశాలనించి వస్తాయో ఈ సుడిగాలులు ఇక్కడే తలదాచు కుంటాయి-

అవి రాళ్ళని ఎవరన్నారు నోళ్ళుమూసుకున్న అంతరాత్మలు;

అవి ఎండలని ఎవరన్నారు, రాళ్ళమీద దండయాత్రలు చేస్తున్న మంటల సైన్యాలు;

నాతోపాటు ఈ రాజ్యా గత చరిత్రకు రక్తమిచ్చాయి

ఈనాడు అవి వట్టి శిలలే; కానీ ఒకనాటి సామ్రాజ్య శిల్పాలు అవి కన్న కలలే!

ఇక్కడ దున్నుతున్న ఓ అన్నా! నీవు ఒంటరివాడివి కావు, నీవు కన్నీటి బొట్టువుగా ఆగిపోవు...

ఈ రాళ్ళలో నీవుపెట్టే ప్రతి అడుగుతో అడుగుకలిపే సోదరుడు మరొక డున్నాడని మరచిపోకు ఈ భూగోళంమీద ఇరాక్‌లో ఇరాన్‌లో మెక్సికోలో మంగోలియాలో...

రాళ్ళ కన్నీళ్ళు వ్యాపించిన ఈ భూములమీద లేస్తాడు ఒకడు, ఇనప కండరాలు దేహంమీద సుళ్ళుతిరుగుతున్న మనిషి-

అవిగో ఎండల కండువాలు ధరించి దూరాన నిశ్శబ్దంగా వెళ్ళుతున్న కొండలు! అవి ఆకాశాల లోతుల్ని నీకు తెలిని ఉచ్చై స్వరంతో వ్యాఖ్యానిస్తున్న ప్రవక్తలు-

నేను ఒంటరిగా ఉన్నాను- శూన్యంలో నిశ్శబ్దాలు పోగు చేసుకుంటూ, దూరాన్ని భుజాన వేసుకుని మోస్తున్నాను రస్తా మీద పోతూ; నా చేతులు నిష్క్రియాభారంతో వేలాడుతున్నాయి.

delivering commentaries on the depths of skies, in exalted tones, which you cannot comprehend.

My only one, i am now alone and gathering silences in voidity, i am carrying the distance upon my shoulders, dragging my feet along the road my hands dropped in the weight of inaction;

come, let us leap like a deluge of songs, on the earth; carry the flowers of our nation's dreams as boats to their destinations.

In this moment of profound love, when our hearts throb with great sentiment for our land, let us become a single drop of tear and fall at the feet of humanity;

veil my eyes, my ears beloved cover them up with your tenderness; in our land where flowers bloom, drops of blood are falling. In our land where birds sing, the air is laden with sighs. The days are tied to the trees and hanged!

The rising sun is removed and flung away savagely into the rocks of the west; each dawn is vomitting blood and my people sit with folded hands ! ......

why don't the mountains scream in rage, why don't the skulls of nights break into pieces, why don't these millions of stars crush themselves to death and fall?

In my own country my voice has become fugitive; the voice I raise here, shoots into the sky and stuck up somewhere, never returns, people! why don't you listen to me ?

Oh, they don't know how to wake up ?

They donot know how to open their mouth and yawn,

రా, మనం ఇద్దరమవుదాం; భూమిమీద పాటల జలపాతంలా దూకుదాం. మన ప్రజల కలల పువ్వుల్ని పడవల్లా మోసుకుపోదాం, వాటి గమ్యాలకు చేరుద్దాం. ఈ ప్రగాఢ ప్రేమమయసమయంలో మన మిద్దరమూ ఒకే బాష్పబిందువవుదాం, మానవత పాదాల మీద రాలుదాం

నా కళ్ళకూ నా చెవులకూ ముందు తెరవాల్చు నా ప్రేమరాశీ! నీ స్నిగ్ధహృదయంతో వాటిని కప్పవోయ్-

పువ్వులు పుక్కిలించే మన ప్రియభూమిలో రక్తబిందువులు రాలుతున్నాయి

పక్షుల గీతికలల్లే మన గాలిలో పళ్ళ నిట్టూర్పులు విడుస్తున్నాయి

మన దినాలను చెట్లకు కట్టి ఉరిదీస్తున్నారు; ఉదయించే సూర్యుడ్ని ఊచపీకి పశ్చిమాద్రికి విసిరేస్తున్నారు మహోగ్ర దౌర్జన్యంతో; ప్రతి ఉషస్సూ రక్తం వాంతిచేసుకుంటోంది. కానీ నా ప్రజలు చేతులు ముడుచుకుని కూర్చొనున్నారు!

అరే! ఈ కొండలరవ్వేం?

ఈ రాత్రుల కపాలాలు పగలవేం?

ఈ నక్షత్రాలు చచ్చి నేలకు రాలవేం-

ఈ గుంపు వినరేం నామాట!

అరే నాదేశంలోనే నా గొంతు పరాయిదయిపోయింది. ఇక్కడ నేను అరచిన అరుపు ఆకాశంలోకి వెళ్ళి ఎక్కడో ఇరుక్కుపోతుంది, తిరిగి రానే రాదు.

అరే! ఈ గుంపుకు ఎలా మేల్కొవాలో తెలీదు ఎలా బాహువులు జాపి తన ఇనపకాళ్ళు ఇలాతలం మీద మోపాలో తెలీదు

కానీ నా ప్రేమరాశీ!

వాళ్ళు మన ప్రియమైన ప్రజలు; మన బలాన్నంతా వాళ్ళకిద్దాం.

They donot know how to stretch their swarthy hands and thunder their legs on the earth...

Darling, they are our own people. let us give them our strength-

Let us love each other so much, that we together give the entire content of our existence to them,

Who make our country, who make our history who fulfill our dreams and aspirations.

మనం పరస్పరం ఎంతగా ప్రేమించుకుందామంటే మన
ఇద్దరి జీవితాల సారాన్నంతా పిండి వాళ్ళకు ఇవ్వగలిగేంతగా-
వాళ్ళు మన దేశాన్ని చేస్తారు,
మన చరిత్రను రాస్తారు,
మన స్వప్నాల్ని నెరవేరుస్తారు-

You called me; but i would have anyhow come in search of you even without your call, in quest of your voices-

Looking with my ears, with my eyes, with my skin, with my nostrils.

Not one, but with all my senses, searching in all directions of my country.

I came, not that i only, know and you donot know; but that we all shall walk in the same direction hand in hand,

Not that we should all speak the same word, but that our word, shall not be a mere word but a flame of light which will illumine the paths of people

And that we shall realise it is within us. It is for this i am in search of you-

My friends, my words and thoughts are countries never tread by the feet of any man. my consciousness is a gypsy who knows no boundaries familar to the antiquated history of mankind;

My footsteps are mighty wild lions that sprawl the dense forests unaware of fear.

I fight with flowers, i fight with gardens of flowers, i fight with clouds, fight with fierce storms,

Fight i breathe to live, my limbs know no submissive postures.

## ఆరో సర్గ

మీరు నన్ను పిలిచారు

కానీ పిలవకపోయినా మిమ్మల్ని వెతుక్కుంటూ నేనే వచ్చేవాడ్ని!

మీ గొంతులు వెతుక్కుంటూ-చెవులతో కళ్ళతో చర్మంతో ముక్కుతో, ఒకటేమిటి

సర్వేంద్రియాలతో అన్వేషిస్తూ దేశం నలుదిక్కులా...

నేను వచ్చింది, మీకు తెలీదనీకాదు, నాకు తెలుసనీకాదు; మనమందరమూ కలిసి ఒక దిక్కుకు నడుద్దామని;

మనమంతా ఒకేమాట చెప్పాలని కాదు మనమాట వట్టి మాటకు బదులుగా మనుషులదారుల్ని ప్రజ్వలితం చేసే ఒక కిరణం కావాలనీ, అది మనలోనే ఉందనీ, దాన్ని మనం తెలుసుకోవాలనీ-

బాబూ! నా భావాలూ నా శబ్దాలూ ఎప్పుడూ ఎవరికాళ్ళూ నడవని దేశాలు

నాచేతన మానవచరిత్రకు తెలిసిన ఏ హద్దులూ తెలీని దేశ ద్రిమ్మరి

నా నడకలు అడవుల్లో నిర్భయంగా తిరిగేసింహాలు; నేను పూలతో పోట్లాడుతాను పూలతోటలతో పోట్లాడుతాను; మేఘాల సేనలతో పోట్లాడుతాను తుఫానులతో పోట్లాడుతాను; పోట్లాట నేను బతకడానికి పీల్చే ఊపిరి!

నా అవయవాలకు నీచంగా వంగే భంగిమలు తెలీవు- నేను సత్యాగ్రహి! సత్యం నా గుండెల్లో బ్రద్దలవుతున్న అగ్నిపర్వతం; నా గొంతులో గర్జిస్తున్న జలపాతం;

నేను నా కళ్ళలశరీరాన్ని దగ్ధంచేసుకుని తప్త హిరణ్య ద్రవంగా ప్రవహిస్తున్నాను నా దేశపు రహదారుల్లో-

రండి నాతోకలిసి...

I am the soldier of righteous indignation. Truth is the volcano that explodes in my bosom. Truth is the fierce cataract that roars in my voice.

I burn my selfish body and flow like river of molten gold in the highways of my nation. Come with me...

Why fear? Be not afraid of yourself, but be afraid for your country, for, understand how great are the losses of your country before your petty, personal ones.

How can you eat and sleep amidst collosal destruction?

You know my brothers, i want new voices brimming with red red hot consciouness, to make my own weapons and armoury, to wipe out the tears of my nation.

You donot know perhaps but i know there are mines of sulphur in your voice; every poem that you make is a gun to fight, and every line that you carry is a cannon to blow up the enemy.

I bequeath my voice to my people; my language breathes the oxygen of my nation. my country is the life of my art...

i am the prophet of blood!

In my country leadership is but mine, I shall not let it go to politics–

Come, take up your arms, your poems, come like armies, like storms, snatching your thunder-bolts which for an occasion you hid in the clouds.

భయమెందుకు; నీకోసం నీవు భయపడటంకంటే నీదేశం కోసం భయపడు; నీవుపొందే చిన్న నష్టాలకంటే నీదేశం నీ ప్రజలుపొందే నష్టాలు ఎంత పెద్దవో తెలుసుకో- ఈ జరుగుతున్న సర్వనాశనంలో నిద్రాహారా లెలా రుచిస్తున్నాయి నీకు ?

కావాలి నాకు వేడి వేడి చేతన తొణికిసలాడే కొత్త గొంతులు-వాటితో నా తుపాకులూ నా శతఘ్నులూ తయారుచేసు కుంటా, నా దేశం కార్చే కన్నీరు తుడుస్తా-

నీకు తెలీదు నీ గొంతులో గంధకపుగనులున్నాయి సుమా! నీవుచేసే ప్రతి పద్యమూ ఒక తుపాకి, నీవు మోసే ప్రతి వాక్యమూ ఒక శతఘ్ని- నా గొంతు నా ప్రజలకు దానంచేశాను; నా జాతే నా భాషకు ప్రాణవాయువు, నా దేశం నా శిల్పానికి ఆయువు, నేను రక్తప్రవర్తను!

నాదేశంలో నాయకత్వం నాదే; దాన్ని రాజకీయాలవారికి అప్పగించను.

రండి పద్యాలు బందూకులుగా ధరించి; నేనల్లా తుఫానుల్లా రండి-

సమయంకోసం మీరు మబ్బుల్లో దాచుకున్న పిడుగులు తీసుకుని రండి!

నేను ఝంఝూమారుతాన్ని-నేను వచ్చాను అశాంతిని పంచి పెట్టడానికి, అరుస్తున్నాను ఆర్తిని తరిమేద్దామని; రండి నాతో, నా ప్రజలారా! రండి... నాతో రావాలంటే, సొంతం కోల్పోవాలి; నీ కంఠంలోనించి నీ సొంతపాట పీకెయ్యాలి, అడుగడుగునా ప్రజలపాట పిడుగులు కురిపించాలి ఆకాశం ఉరిమినట్లు...నీ యుద్ధాగ్నులు నీ దేశపు యుద్ధాగ్నుల్లో కలపాలి. నీ పిడికెడు బ్రతుక్కి- ఎంత ప్రేమ కావాలి ?

I am the tempestuous wind

I have come to distribute to you unrest,

I am shouting to chase away oppression from the earth.

Come my people, come follow me.

To follow me, you must ruthlessly set aside the self that clings to you, and become free.

Your voice should banish your own song and give birth to the song of the people, just as the voice of the sky hurls out its thunder.

You should join your wars with the wars of your country–

How much love after all does your small life require?

The earth will be inherited by the oppressed; come let us excavate our dawn, buried deep in this land.

Come my people take up your ploughs. Come with your women, your children, come out of your hearths and homes, from prisons of your schools and offices, your academies and assemblies. Come let us see centuries blown off in the winds of time.

Come, walk with me through the villages towns and cities· Flow like floods, roar like floods through all the streets and highways of our nation.

Look at the graves in our fields, in our forests, in our hills, in our walls and halls where they buried our dawn!

Come, take up your ploughs brothers,

throw off your books my children, let us suck the life-breath out of those swines who buried our dawn, and made us slaves in our own country.

పీడితప్రజలకే ఈ భూమి సంక్రమిస్తుంది! రండి, పాతి పెట్టిన ఉషస్సును బయటకి తీద్దాం. ఉషస్సు ఉషస్సు అంటూ పరుగిడుదాం పదండి; రండి నాతో నా ప్రజలారా! మీ నాగళ్ళు భుజాన వేసుకురండి, మీ భార్యల్నీ మీ పిల్లల్నీ మీ అందర్నీ తీసుకురండి. ఇళ్ళలోనించి వాకిళ్ళలోనించి స్కూళ్ళనే జైళ్ళలో నించి ఆఫీసులనించీ అసెంబ్లీలనించీ అకాడమీలనించీ రండి- కాలపు గాలిదుమారంలో శతాబ్దా లెగిరిపోతున్నాయి చూద్దాం పదండి...

నడవండి నాతో-పల్లెలగుండా పట్నాలగుండా, ప్రవహిస్తూ రండి గర్జిస్తూ రండి!

చూడండి! ఆ పొలాల్లో ఆ అరణ్యాల్లో కొండల్లో గోడల్లో, మన ఉషస్సును పాతిపెట్టిన గోరీలు కనపడడంలేదా? నాగళ్ళు తీసుకోండి నా సోదరులారా! పుస్తకాలు పారెయ్యండి నా దేశపు పిల్లలారా! మన ఉషస్సును పాతిపెట్టి, మనదేశంలోనే మనల్ని బానిసలుచేసినవాళ్ళ ప్రాణవాయువులు పీలుద్దాం పదండి.

మానవ జీవితవ్యవసాయంలో సుఖాలు నిర్మిస్తూ దుఃఖాల దండలు వేసుకున్న శ్రామిక కోట్ల అడుగులు ఈ నేలలో వెతుకుదాం పదండి, భూమిని చీల్చి దున్నుదాం పదండి; మన నాగళ్ళకు తగిలే ఆ కోట్లాది గొంతుల్ని ఏరుకుందాం పదండి; ఈ ఎర్రకోరిక జెండాగా పట్టుకుని ఎగరేద్దాం రండి—

ఈ ప్రయాణంలో ఆవిష్కరిద్దాం మనిషికి మృత్యువులేదనీ, జీవం ఎన్నటికీ చావదనీ— రండి, చాలాదూరం నడవాలి; సొంత గోడల్ని దాటిరండి, ప్రజాసముద్ర తరంగాల్లో క్రీడిద్దాం పదండి; మరోలోకపు తీరాలకు కొట్టుకుపోదాం పదండి-

నీకు తెలుసా ఆకలి ఉందని, నీకు తెలుసా దప్పిక ఉందని; అవి రెండూ నీ విలువైన స్వేచ్ఛ మాంసం తిని బ్రతికే క్రూర మృగాలని-

నేను నీ జాతిగొంతునై చెపుతున్నాను, విను! వాటి బారి నుంచి నీవు తప్పించుకోవాలంటే, మీ నాన్న బొమ్మలూ బొమ్మల

Let us search, in the earth for the footsteps of these millions who embraced suffering while building edifices of happiness in the fields of mankind.

Come let us plough and tear the earth.

Let us pick the millions of dumb voices that stumble across our plough,

Let us unfurl this red desire and walk ahead. Let us discover in this journey that man has no death and life never dies;

Come friends, there is a distance to go, come breaking your selfish walls.

Let us bathe in the epic waves of the people, let us be washed off to the shores of the new world, come let us go.

Do you know that there is hunger?

Do you know that there is thirst and that the two are the most cruel animals that live on the flesh of your precious freedom?

I have come to you, as the voice of the whole nation, to tell you that if you want to escape from their clutches and also your generation along with you,

Reject the dolls and picture books that your father gets you. Ask him to get you fields and factories, and tell him, they are the toys which you like:

If your father cannot get them for you, let all the fathers of the country unite.

My children, when you go to the colleges, do you know the fields look at you with tearful eyes,

పుస్తకాలూ తెచ్చియిస్తే తీసుకోక, తిరస్కరించు: పొలాలిమ్మను ఫ్యాక్టరీలిమ్మను. అవే నీ ఆటవస్తువులని చెప్పు; మీనాన్న తేలేక పోతే దేశంలో నాన్నలందర్నీ ఏకం కమ్మను.

నీవు కాలేజీకి పోతుంటే బాబూ! నిన్ను పొలాలు వికృతమొహంతో చూస్తున్నాయి. ప్రతిరోజూ ఈ పుస్తకాల ఊరేగింపు ఎందుకు ఈ దేశపు వీథుల్లో; దేశంమొహం చూస్తే అవి చేసే ఉపకారం అవగాహన అవలేదా? అంటున్నాయ్- నీవు కాలేజీ గోడల్లోకి పోతావు, అక్కడ్నించి గవర్నమెంటు గోడల్లోకి పోతావు అక్కడ్నించి ఎప్పుడూ ఎవ్వరూ తిరిగిరాని గోడల్లోకి పోతావు. ఇక నీవు బ్రతికిందెప్పుడు? మీ నాన్నలతరం అదేచేసింది, మీకు ఆ ప్రశ్నే వారసత్వంగా ఇచ్చిపోయింది!

మీరు పలకా పుస్తకాలూ పట్టుకుని పోతుంటే బాబూ! మీరు శిలువలు మోసుకుపోతున్న బాల క్రైస్తుల్లా కనిపిస్తారు నాకళ్ళకు-

లే బాబూ! లే, నీ బాల్యంలోనించి లే! పుస్తకాలవతల పారెయ్! నాగలి భుజాన వేసుకో: ఈ కులాలు విడిచిపెట్టి ఆ పొలాల్లో కలువ్; గతకాలపు దారులకు కఠినంగా వీడ్కోలుచెప్పు.

ఇదిగో మీకు నా గుండెల్లో నేను పదిలంగా దాచుకున్న దావాగ్ని దానంచేస్తున్నా: ఈ లోకాన్ని దహించండి, మీ లోకాన్ని సృష్టించుకోండి! అరవండి హోరుగాలులై. ఊరికే తిండితిని, గాలిపీల్చి, శ్వాస వదిలేసి, శాశ్వతంగా వెళ్ళిపోయేవాళ్ళం కాదని చెప్పండి, మీరు అడవులువిడిచిన అగ్నిజ్వాలలు, కట్టలుతెగిన సముద్రాలు-

చరిత్రలో ఈక్షణం శిఖరాలెక్కి పిలిచింది; నా నుదుట ప్రయాణం స్వేదబిందువై నిలిచింది- ఇప్పుడు ఈ సత్యం మీకు నా రక్తంతో ధారబోస్తున్నా!

స్వేచ్ఛ మనిషికి మొదటిశ్వాస; అది నీ రక్తపు సజీవభాష; భూమినించి నీవు నీ చివరిఅడుగు తీసేవరకూ నిలుపుకోవలసిన ఒకే ధ్యాస.

They ask: 'why always this futile procession of books in the roads of the country? what good after all did they do to this land'?

You go into the walls of the colleges, from there into the walls of the goverment; and then finally into the walls from which nobody ever returned. Then, when did you live I want to know!

The generation of your father did the same leaving that very question as their legacy to you, their sons···

When you walk past holding your slates and books, to my eyes, you look like child-christs each carrying his cross.

Rise, my child, rise from your childhood. Cast away your books. take up your plough. Break the old chains and run to the voice of the fields

Bid goodby to the old roads.

Listen to me, I bestow on you the great gift of my ferocious fire, which like a miser i carefully saved in my heart. Burn this rubbish of the old and create a new world of your own.

Roar like the hoary winds, and announce that you have not come to merely eat and breathe and then lay down your breath and simply leave; that you are those giant fires that left the forest lands, that you are the mighty seas which broke their bund.

This moment in history climbs my peaks and calls! My journey turns into a drop of sweat and stands upon my brow. Now I bequeath to you this truth with the signature of my blood.

పొలాలు మీ పాఠశాలలు, అడవులూ నదులూ ఉదయాస్త మయాలూ మీ గురువులు. హృదయపూర్వకంగా వాటి భాషకు లొంగండి; వాటి శిక్షణ పొందండి.

పొలాలు మీకు స్వేచ్ఛాదానం చేస్తాయ్. హాయిగా పీల్చే ఊపిరి కానుకగా ఇస్తాయ్, పీఠభూమిలాంటి ఛాతీ ఇస్తాయ్, ఇనప ఊచల్లాంటి కాళ్ళిస్తాయ్. గౌరవజ్వాలలు మినే కళ్ళిస్తాయ్, గిరి శిఖరాల్లాంటి శిరస్సులిస్తాయ్... పదండి మీ నూతన గురువుల పాదాలదగ్గరకు. ధైర్యంగా నడవండి, దేశం మీదే!

ఎందుకు నీకా గుండె నీవు దాన్ని బాధలతో నింపుకో లేకపోతే;

ఎందుకు నీకా కళ్ళు నీవు వాటిని కన్నీటితో తడుపుకో లేకపోతే–

రోజూ నేను వెయ్యిసార్లు ఏడుస్తాను నీకు తెలుసా?

మీతో ఐక్యం అయితేనే నాకు నా మోక్షం దొరికినట్లు; మీరే నా సముద్రం; మీలోకి ప్రవహించడానికే నేను మబ్బుల్లోనించీ కొండల్లోనించీ అడవుల్లోనించి దేశం నాలుగుదిక్కులనించీ పరు గెత్తుకు వస్తున్నాను...

నేను పరుగెత్తే ప్రవాహాన్ని: నన్నాపకండి; స్వల్పలాభాల కోసం పంటకాల్వలుగా మలుద్దామని మీ క్షుద్రవిద్యలు నామీద ప్రయోగించకండి–

నా గంభీరవేగాన్ని చూడండి, మీ కన్నులు పండుగు చేసుకుంటాయి; నా భయంకర గర్జ వినండి, మీ వీనులు ఆనందపు విందులు చేసుకుంటాయి, నా మహాప్రస్థానం చదవండి–
రండి నా శబ్దజ్వాలలమీద మీ హృదయాన్ని రొట్టెల్లా కాలుస్తా, మీ రెటునడవాలో చూపిస్తా–

Freedom is the first breath of man; that is the living language of your blood and it shall be your sole desire to retain it until you lift your last footstep from this earth.

Fields alone are your schools; rivers, clouds, sunrises and sunsets are your teachers; wholeheartedly surrender to their language. Accept the discipline they impose.

Fields grant you the gift of freedom, they present you the happiness of breathing in complete relaxation. They give you an enormous platueau like chest, legs of hard iron; a pair of eyes that spit fire of self respect and a head held erect like a mountain top.

Come lay youself at the feet of your new teachers. Walk with courage, the country is yours.

Why should you have a heart if you cannot fill it with pains?

Why should you have those eyes if you cannot wet them with tears?

I cry each day a thousand times; i realise my liberation when i merge with you.

You are my sea i run only to flow into you from the clouds, from the hills, from the forests, from all directions of my country.

But look, i am the great flood rushing forward don't come in my way. Don't try mean tricks on me, to turn me into petty channels of utility.

నేను, చెట్టును పిడుగుచీల్చినట్లు, సమాజాన్ని చీలుస్తా; లోకంలో గాలినంతా పీలుస్తా...

నా కాగితాలన్నీ కాల్చేస్తా నా పర్వతాలన్నీ పేల్చేస్తా; నా శరీరపు ఇల్లంతా రక్తంతో అలుకుతా నా కిటికీలన్నిటిలో పొలికేకల దీపాలు వెలిగిస్తా నా నరనరాలన్నిటినించీ కాంతి పిండి ఇచ్చేస్తా; నా రక్తమంతా కారిపోవాలి నా శక్తి అంతా ధాన్యంగా పళ్ళుగా మారిపోవాలి; నా పంటలతో చేలు నిండిపోవాలి– నా దేశానికి ఒక ఉద్యమ విద్యుత్తు ఇచ్చాననే తృప్తిలో నా ఆత్మ వెచ్చదనం అనుభవించాలి.

నీకు ఈ తిండిగింజలు ఎలా వస్తున్నాయో తెలుసా

ఈ నేల ఎవరు దున్నుతున్నారో తెలుసా

ప్రాణదానసాధనం, ఈనాగలి, ఎవరుచేస్తున్నారో తెలుసా! మట్టిశక్తి అవగాహన చేసుకో బిడ్డా!

ఇనుము జ్వాలల్లో మండుతోంది; గుండె ఎండల్లో పండుతోంది; ఉదయభాస్కరుడులా జ్వలిస్తున్న ఇనపముద్దమీద సమ్మెటపడుతోంది.

ఉక్కుబాహువుల వీరులు తుఫానులు ఊదుతున్నారు, పాత లోకాల్ని భస్మంచేస్తున్నారు, కొత్తలోకాలు సృష్టిస్తున్నారు కర్మాగారపు కొలిమిలో–

ఒకప్పుడు జీవనవ్యవసాయంలో శ్రమించిన ఈ గొంతులేని మిలియన్ల భూమి అడుగున్నే అదృశ్యమైపోయారు. ఈనాడు ఆ గొంతును లెమ్మను తమ్ముడా! వాళ్ళ రొట్టె వాళ్ళకిమ్మను ఓ సహోదరా! చెమట పరిమళాలుమినే వాళ్ళ పవిత్ర శరీరాలనించి మానవజ్వాల త్రవ్వి తీయరా!

ఎడ్లకళ్ళలో కుంపట్లు రాజుతున్నాయ్ నాగటిభ్రుకుటిలో క్రోధాగ్నులు రేగుతున్నాయ్

Look at the force of my wild fretting waters; your eyes will go into raptures.

Listen to the wrath in the roar of my voice; your ears will enjoy feasts of ecstacy.

Read the epic of my journey···

come, i shall roast your hearts on the flames of my language;

i shall show you your destination.

Like a brute i shall hew the society of man, as a tree is cleft by a thunderbolt.

I shall burn all my papers, i shall burst all my hills, i shall paint the whole house of my body with pure blood,

And lit all my windows with the lamps of wild voices; i shall squeeze from my every nerve and donate all my light.

I shall bleed to the last drop and my whole energy shall bear every fruit of the earth–

All fields will be full of my harvests.

And then,

i shall bask in the warmth of fulfillment that i could give one flash of awakenment to my people.

Do you know how the grain is coming?

Do you know who are tilling the land?

Do you know who makes the plough into the life giving weapon of the tiller?

Do you know what power the earth possesses?

సూర్యుడా! మండు ఇంకా మండు! మా అంధకారం శాశ్వతంగా నశించేవరకూ మండు—

నేను దేశాన్ని దున్నేవాణ్ని; ధాన్యానికి కాపుకాచాలనీ ఆ కాళ్ళలో పేదల ముంగిళ్ళకు నడుద్దామనే కలలు రావాలనీ ఊహల వ్యూహాలు పన్నేవాణ్ని—

దున్నినదంతా చూస్తూ దూరంగా కూర్చుంటాను, గాలికి నా నిట్టూర్పులు మేతవేస్తూ, బంగారు బస్తాలు మోసే వంగిన వృద్ధకూలీలా ఉన్న పశ్చిమాన్ని చూస్తూ—

మట్టి పిసుకుతాను; మట్టిలోనే చెట్లతో పైర్లతో పెరుగుతాను; పళ్ళతో ధాన్యంతో బతుకుతాను నా దేశంలో—

చేతులనిండా పని ముంచిపోస్తాను, తెల్లవారగానే మళ్ళీ పనికోసం ఖాళీగా ఉంటాయి నాచేతులు;

నాతో దినమంతా నా మిత్రుడు గగనంలో ఎండ నింపుతాడు; తెల్లవారగానే మళ్ళీ గగనం ఖాళీగా ఉంటుంది ఎండకోసం...

భూమిని బుజ్జగిస్తాను లలితంగా లాలిస్తాను వెన్నలాంటి మన్నుతో గోరుముద్దలు చేసి పైర్ల పసినోళ్ళ కందిస్తాను.

నా శరీరం పృథివి: గ్రీష్మంలో రెండూ నీటికోసం తపిస్తాయి. చిక్కటి రక్తమాంసాలతో మిస మిసలాడే వర్ష బిందువు నా ఊహల పొడిమన్నులోకి జారినప్పుడు గుప్పున ఏవో కలల పరిమళాలు చెలరేగుతాయి.

Know my friend, the creative powers of the earth.

In the flames, the iron is red hot, in the mid-noon the heart is wilting, heavy blows of the hammer are falling on the solid iron which is burning like the rising sun;

The steel armed heroes are blowing storms, burning old worlds and recasting new ones in the smithy of labour.

Those toiling multitudes of bygone days vanished into the earth without a voice–

Call, my heroes, that voice back to life today.

Thunder, my heroes,that their bread should be returned to them.

Resurrect that flaming humanity buried in the dust of their bodies.

Furnaces are blazing in the eyes of oxen; fury is raging on the forehead of the plough.

O sun, burn, burn yet more until all our dark nights are vanquished forever.

I am the tiller of this land, my head is full of fancy, that the grain of the land acquires legs; and those legs acquire dreams of walking to the homes of the hungry.

I till the land all day, and then i sit at a distance; scanning with my eyes the immensity of the land which i tilled, feeding the air with sighs, and watching the evening which looks like a bended old labourer, carrying sacks of gold upon his back.

నేను విరిగిన కలలోనించి పుట్టాను, విరిగిన ఇంద్రధనుస్సు కార్చే రంగుల్లో స్నానం చేశాను—

నా పక్షులు గాలిలో స్నానంచేస్తాయ్ కొమ్మల్లో ఇళ్ళు కడతాయ్ ఆకాశంలో రస్తాలు వేస్తాయ్.

నా కలల దేశంలో నాకున్నది ఒక్క గుడిసే। నేను ఎందుకు బ్రతకాలో ఒక సున్నలో, నాకే తెలీదు.

అందరూ వరికోతలకు పోతున్నారు; నేనూ పోదామని నా గుండెలో ముత్యాలు గలగల్లాడుతున్నాయి: నా కొడవలి విరిగి పోయింది; దాన్ని బాగుచేసేవాళ్ళే లేరు ఈ ప్రియమైన నా దేశంలో-

నేను గుప్పెడు వెల్తురుకూడా దోచుకోని గుడిసెల్లో నడిచిపోతున్నాను...

కాళ్ళు నరికివేసినా దూరాన్ని తొక్కుతూ నడిచిపోతున్నా

చేతులు నరికివేసినా నా కలల శిల్పాలు చెక్కుతూ నడిచి పోతున్నా

నాలిక కోసివేసినా నిశ్శబ్దమే పుచ్చుకుని నడిచిపోతున్నా

సముద్రంలోకి పోయే ప్రవాహంలో

దిశల్లోకి పోయే ఝంఝూమారుతంలో

క్రూరాంధకారంలో గోరంత దీపంకూడా లేదు పిడికెడు కిరణపు తునకలైనా భిక్షంవెయ్యడానికి।

ఏ గుడిసెల్లో పగలు మనుషుల్లేరో ఏ గుడిసెల్లో రాత్రి వెల్తుర్లేదో ఆ గుడిసెల్లో నడిచిపోతున్నా-

I am mixed up with the earth. I grow like the trees and the crops in the earth; and live like fruit and grain in my country.

The whole day my hands are full of work but by dawn my hands are again empty, seeking work- like my companion the sun who works the whole day to fill the sky with light, and again the next day the sky is emptied to be refilled.

I coax the earth tenderly, and nurture the young crops, feeding them affectionately, with soft and tasty soil made like butter with all the skills of my cultivated hands.

My body is earth; both burn and thirst for water in the seasons of summer when the sun is furious.

When the fat rain drop shining with flesh and blood slips into the dry earth of my mind, wakes up a whole crowd of scented dreams.

I am born out of a broken dream.

I bathe in the colours leaking from a broken rainbow; my birds swim in the air, build houses in the branches, and lay roads in the sky.

In the country of my dreams, i have only a hut;

I donot know why I must live in a zero !

All are going for harvesting the crops; pearls of desire are rumbling in my heart to join the procession but my sickle is broken! And there is no one to mend it in my beloved land-

ఎక్కడ తిండిలేని పసివాడు దూడను మేతకు తీసుకు పోతున్నాడో

ఎక్కడ పసితనంకూడా బతకడానికి పనిచెయ్యాలో అక్కడ నా కాళ్ళు నిజంగా తెగిపోయాయి

నా చేతులు నిజంగా రాలిపోయాయి నా నాలిక పడిపోయింది;

అక్కడ నేను మహా ప్రవాహాన్ని కాను

అక్కడ నేను ఝంఝూమారుతాన్ని కాను,

ఆ పసివాడి కాళ్ళముందు!

కడివెడు కన్నీళ్ళు పోశాను ఆ కాళ్ళమీద; నా ఆత్మలో ముత్యాలవంద తెగి అతని ముందు పడిపోయింది; నా పద్యం అటు వైపు చూడలేక ఏడ్చింది; ఇక్కడ్నించి నన్నొక స్వర్గంలాంటి కలలోకి రమ్మన్నా నేను రానని చెప్పింది,
శాశ్వతంగా ఆ నేలకే అంకితమైపోయింది.

ఉషస్సు వచ్చిందని కేకవేస్తే ఊళ్ళో

అందరూ బయటికివచ్చారు.

పిల్లలంతరూ వీథుల్లోకి పరుగులెత్తారు.

ఇళ్ళతలుపులూ కిటికీలతలుపులూ మేడల తలుపులూ మిద్దెల తలుపులూ– ఊరితలుపులన్నీ తెరుచుకున్నాయ్ ఉత్కంఠంతో–

కానీ చూచింది సూర్యుడికి బదులు, సూర్యగ్రహణం!

మనుషుల్నే కాదు దేశపు పొలాల్ని అడవుల్ని నదుల్ని మోసంచేశారు...

I am walking, walking past dark rows of huts not lucky enough to possess even the flicker of a wick,

My legs were chopped off, but i kept walking, treading the distance;

My hands were chopped off, but I kept on walking, sculpturing my dreams.

My tongue was chopped off but went on walking holding just silence.

I was flowing like flood into the sea.

I was blowing like mad wind into the sky there was not even a candle of light in the cruel and tearing darkness, to give me a handful of rays.

I am walking in the rows of huts where there are no men by day and there is no light at night.

I am walking-

Here, a child is leading a young calf to feed, having no food himself; where even childhood has to work to survive;

There, my legs really got chopped off
My hands really dropped off
And my tongue fell dead
There, i am not the flood
There, i am not the mad wind at the feet of that child.

I poured all my tears at those feet. The necklace of pearls that was swinging in my soul, snapped and fell at those feet, my poem turned aside her face and wept.

The poem said :

ఓహోహో! ఇక్కడ జీవితం కుళ్ళిన పండులా శిథిలమై పోయింది. ఈ విషవృక్షపు అంటు మరొకచోట స్వాదుఫలాలు కాయదు. దీన్ని నిర్మూలించడమే కర్తవ్యం!

సీటిగాయాలు చెట్లగాయాలు పైర్లగాయాలు మీకు కని పించవు. పొలాలూ నదులూ అరణ్యాలూ వీరమరణం పొందిన ఆత్మలు!

ఎవరు దేశమంతా దున్ని తమ దేహాపుకండలు మట్టి కిచ్చారో,

ఎవరు నేలగొంతు ఆలించి దాన్ని లాలించి తమచెమటతో రక్తంతో వెన్నలా జున్నులా మృదువుచేశారో,

పెరిగే పైర్ల వంపూ సొంపూ అందమూ గంధమూ లాలసతో చూస్తూమూచూస్తూ, ఉదయించబోయే ధాన్యంకోసం ఉదయాస్తమయాలూ కలలుకన్నారో,

కానీ అంతిమసమయంలో ఒక్క గింజకూడా దక్కకుండా అంతావిడిచి నిష్క్రమించారో,

ఆ మృతవీరులు, మానవ ఇతిహాసంలో అమృతవీరులు, ఆ కోట్లాది పేరులేని శ్రామికజీవులు భూమిని వదల్లేక మట్టిలో కలిసి నిరీక్షిస్తుంటారు.

గింజ దిగగానే చినుకు పడగానే వారు ప్రేమించిన గింజల గర్భంలో ప్రవేశిస్తారు; చెట్లవుతారు పైర్లవుతారు; పళ్ళయ్ పంటలయ్ మనుషుల్లో ప్రవేశిస్తారు, మనుషుల జన్మలకు మళ్ళీ బీజాలవుతారు.

కనకనే చెట్లు ఈ దేశంలో తమ పిల్లలు ఎందుకు స్మూళ్ళకు పోతున్నారని కన్నీళ్ళు కారుస్తాయి, పైర్లు రోదిస్తాయి.

అవి నోరు విప్పలేక కాదు–నోరు విప్పిననాడు దేశాలు ఖండాలు ఖండాంతరాలుతట్టుకోలేవని!

'I cannot come even if you invite me into a heavenly dream from here, where I am rooted forever.'-

When somebody shouted: 'dawn has come', all the people of the village came out to see.

All the children ran into the streets; doors of houses, doors of windows, doors of taverns, and doors of workshops- All the doors of the village opened with great eagerness

But what they saw, instead of the sun, was the eclipse!

They cheated not merely men, women and children of the country; but the fields, the forests and the rivers as well.

There is no hope now; life here like a rotten fruit has decomposed; graft of this piosonous tree cannot bear useful fruit, even if planted elsewhere; and to entirely uproot it is our only duty.

You cannot sense the wounds of water, the wounds of the trees, the wounds of the crops.

But you perhaps don't know that the trees, the crops and the waters are the souls of great martyrs, unrecorded in the pages of our history.

Those who plough the whole terrain and give the flesh of their bodies to the earth, who fondle her and listen to her heart beats, with their blood and sweat render it soft as cheese and butter, who dream for days and nights

ఒక చెట్టు గనక, పర్వతాగ్రాలెక్కి కేకవేస్తే చెట్లు గుంపులు గుంపులుగా వస్తాయి, తోటలై పాటలై అడవులై అరణ్యాలై అన్నిదిక్కుల్నించీ వస్తాయి.

అవి తీర్మానిస్తాయి, మా పిల్లల్ని ఈడ్చుకుపోయి బానిసలుగా చేసేవాళ్ళ ఇళ్ళలో, ఆఫీసుల్లో, విశ్వవిద్యాలయాల్లో ఊడిగం చేయకూడదని-

తిరస్కారసూచకంగా తలుపులు దూలాలు ద్వారబంధాలు కుర్చీలు బల్లలు అన్నీ చెట్లుగామారి బయటకివచ్చేస్తాయి; అరణ్యాల్లోకి పోతాయి, నీళ్ళు నదుల్లోకి పోతాయి, గాలి ఆకాశంలోకి పోతుంది-

బానిసల్ని తయారుచేసే కర్మాగారాలన్నీ కూలిపోతాయి, కర్మ ఆగిపోతుంది, కర్త పారిపోతాడు!

స్కూళ్ళ జైళ్ళలోనించి పిల్లలు విముక్తులవుతారు-మబ్బులు మళ్ళీ వర్షిస్తాయి నదులు ప్రవహిస్తాయి అడవులు ఆకాశాలవైపు బాహువులు ఊపుతాయి; పిల్లలు పూల మిలియన్లయ్ పొలాల్లో గంతులేస్తారు.

దేశం మళ్ళీ శ్వాసపీలుస్తుంది-

నవ్వు మొహాన రాసినవాళ్ళని చూస్తే నా చెయ్యి బాంబు కోసం వెతుకుతుంది!

వాళ్ళకు నవ్వేంతటి సుఖం ఎలాదొరికింది? ఎవడికి లంచమిచ్చి కొనుక్కున్నారు? అని నాలోపలి అడవుల్లో ఆకలి దహిస్తున్న వెయ్యితోడేళ్ళ పరవళ్ళు తొక్కుతాయ్!

watching the tender crops like their own children, feeling their every subtle scent, every little curve as they grow.

And when the grain appears, the fruit of their dreams, the children of their own sweat and blood, they exit with empty hands–

Ploughers, those great heroes in the epic of man,

Those millions of nameless martyrs, live inside the earth, reluctant to depart, cuddled affectionately to the ancient aroma of earth;

When the seed is laid and the rain drop descends, they enter the womb of seeds, become fruit and grain, and then enter into the people, to become seeds of the next generation.

Therefore, the trees in the country shed tears, and the crops cry when they see their children dragged to schools–

It is not as if they cannot loudly protest, but they are too kind to avoid the consequence of that event, which even the countries, continents and oceans of the earth cannot withstand.

Should only a tree climb up the top of a hill, and raise its voice and give a call, all the trees of the earth will run, from all directions, in crowds and large multidudes.

There would be a huge rally of forests, fretting for action, they will resolve, that they shall not lend any form of service in the houses, offices and universities, of those who snatched away the children of the country and transformed them into slaves;

పాపం అమాయకులూ నీతిపరులూ ఈ దేశంలో అంత ఖరీదైన నవ్వుని కొనుక్కోలేరే–

అందమైన వస్తువులు ఎదురైతే నాకు అసహ్యం! అందం ఎంత అప్రస్తుతం నా సందర్భంలో; ఆనందం అందపు రూపాంతరం, అందుకే ఆ రెండూ నా శత్రువులు–

నా కెందుకీ అందం– నా తండ్రి మొహాన ఉమ్మేస్తుంటే మీ ఆఫీసర్లు? పిల్లవాడ్నిగా నా కళ్ళు చూచాయి నిప్పులు కక్కలేక నీళ్ళు కక్కాయి, ఇప్పుడు రక్తం కక్కుతున్నాయి–

నా కెందుకీ అందం– అగ్నిపర్వతమంతటి శక్తి ఉన్నవాడ్ని, నన్ను అసమర్థుడన్నారే, మీ గాడిదలు!

మానవత్వంతో మనిషి గౌరవంతో చెల్లాడుతారు; అవి వాళ్ళ ఆటవస్తువులు– లంజాకొడుకులు!

నీ శబ్దాలంకారాలు నన్ను ఓదార్చగలవా ఒరే "ఆస్థాన" కవీ!

నా ఉష్ణోగ్రత చూచి నాగరకభాష ఎప్పుడో నా పెదవులు వదలి పరారయిపోయింది: ఇప్పుడు తిట్లుకాదు– నా శరీరం ఆపాదమస్తకమూ అగ్నిచ్ఛటల వర్షపాతం వీస్తోంది.

ఆ పెద్దబిల్డింగుని ఒక్క గుద్దుతో బద్దలుచేద్దామని నా హస్తం లేస్తోంది.

ఒరే! మీ మొహాలుచూస్తే నా పూలప్రపంచపు ఆశలు మండి మసి అయిపోతాయి. మీ మొహాల క్రూరత్వంనించి నన్ను నేనెప్పుడు రక్షించుకుంటాను అన్నదే నా ఏకైక కోరిక

మీరు ఒకర్నొకరు మంచిగా అవగాహన చేసుకుని హాయిగా నిర్మించుకున్న మీ బకాసురసంస్థ ఉన్నదే అది ఎప్పుడు భస్మీపటలం అవుతుంది అన్నదే నా ఏకైక స్వప్నం–

అన్ని అందాలనూ నాశనంచేసే దురాత్ములారా!

As a sign of protest, the doors, the windows, the beams, benches, tables, chairs-all the wood that went into these structures will turn into trees again, and walk away to the forests.

Waters will return to the rivers, and air into the sky; then the factories of slavery will collapse, the process of manufacture abandoned; leaders of the trade flee for life. And all the children of the country released from their prisons.

Then clouds will again rain, rivers will begin to flow, forests will stretch their gigantic hands towards the sky in great jubilation; and millions of children, will jump and dance in all the fields, like flowers and the country will begin to breathe once again.

When i see the face on which smile is writ large, my hand involuntarily reaches for a grenade-

'How could they acquire a smile like that?'

'Whom did they bribe to buy that sleek smile?'

Stirred up in the forest within me, rush a thousand hungry wolves with flaming questions in their eyes.

Pity, that the honest and the innocent cannot aford a smile like that in our country!

My hatred wells up when I see beautiful things!

How irrelevant is beauty in my context! Joy is another form of beauty; that is why both are my enemies!

మీరు అందాలమీదే అధ్యక్షత వహిస్తారా?

చెట్లన్నీ, తమ కడుపుమంట వెలిబుచ్చడానికి, వసంతరుతు వనే పేరుతో ఏటేటా మంటల హర్తాళ్ జరుపుతుంటాయి, పూల మంటలు ఒంటినిండా పూసుకుని; వాటి మొహాలమీద అసమ్మతి సంతకాల్లా పక్షుల బారులుంటాయి,

నన్నిలా చూస్తే ఏముంటుంది? బతికిఉంటే పామరుడ్ని, చస్తే అమరుడ్ని-

మనుషులు తపస్సు చేసిచేసి ఒక పామును పుట్టించారు. విరివిగా ఓట్లనే (oats) ధాన్యపుగింజలు వేసి పెంచారు. దాని పడగల నీడల్లో హాయిగా బ్రతకవచ్చునని ఊహించారు. ఆ పాము చట్టాలనే గుడ్లు సక్రమంగా పెడుతుంది; తరచూ, తనగుడ్లు తానే తింటుంది. కానీ తనజాతిని పెంచుకుంటుంది- నాగస్వరం ఊదే వాళ్ళముందే శిరస్సు ఆడిస్తుంది, లేకపోతే కస్సుమని కాటు వేస్తుంది-

అనతికాలంలోనే, నాలుగు ముష్టిగింజలకోసం నాగస్వరం ఊదే తెగ తెగపెరిగింది దేశంలో; మామూలు మనుషులకు మసలేచోటే లేదిప్పుడు నాదేశంలో! ఈనాడు ఇదే నాదేశచరిత్ర-

బాబూ! ఈ దేశాన్ని ఈ పొలాల్ని చూస్తే కన్నీళ్ళు రావడంలేదా? నీ పంటలగుండెల్లో బాకులుదింపినవాళ్ళమీద ద్వేషోద్రేకం రేకెత్తడంలేదా?

What have I to do with beauty or joy, when your officers spat on my father's face, which my eyes saw as a boy, and could not shed fire, shed only helpless tears; and now shed red blood.

What have I to do with beauty when your officers called me incompetent? Me? Who has power of nothing short of a volcano–

They interfere with human dignity and the birthright of self- respect,– bastards– they make our precious lives their play-things.

Seeing my temperature, civil language fled away long ago in terror from my lips.

Now it is not even abuse- from head to foot my whole body is blowing dreadful hurricanes of blood and fire.

My hand rises to smash to smithereens that huge building with one stroke of my fist.

When i see those faces, the hopes of my whole world of flowers are burnt to ashes.

When can I rescue myself from the tyranny of your faces. When does it crumble into rubble and rubbish that octopus institution of yours which you so grandly constructed on a happy understanding of each other.

You you barbarous tribes! you preside over beauties, you who are born with the one mission of destroying it.

All the trees burning with fury observe hartal of flames year after year in the wrong name of spring, annointing over their bodies flames of flowers, and on their faces perch rows of birds, as symbols of their signature of protest.

What do you find there if you look at me like this? Alive I am mortal, dead I am immortal.

ప్రజాస్వామ్యం పేరుచెప్పి ఎందరిప్రాణాలు తీశారో ఆ లెక్కలు వేయాలి; నీచంగా ఇంకా బతుకుతున్న గతుకుతున్న జనాభాలెక్క లెందుకు ?

పాముకాటుతో భస్మమవుతున్న ఓ నా ప్రజలారా! రండి, మీకో కొత్తపద్యం ఇస్తా; ఈ పద్యం మీకో కొత్తప్రాణం ఇస్తుంది, ఒక కొత్తప్రయాణం ఇస్తుంది–

నాగస్వరం ఊదే క్షుద్రవిద్య నేర్చుకోకండి, పామునుచంపే ఉన్నతవిద్య నేర్చుకోండి–

ఈ దేశంలో, ఒంగేవాడికి ఒంగి సలాం చేసేవాడు పుడుతున్నాడు, జాగ్రత్త! ఈ లక్షణం తలయెత్తిందంటే, ఆకాశంలో తోకచుక్క పుట్టిందన్నమాటే–

వాడ్ని చంపెయ్యండి, పాములు వాటంతట అవే చస్తాయి. అసలు వాడ్ని మాతృగర్భంలోనే పసిగట్టి సంహరించండి. ఈ దేశపు గాలి పీల్చడానికిగానీ, ఈదేశపు నీరు తాగడానికిగానీ, వాడికి హక్కులేదు–

వాడి దుర్గంధపు ఊపిరితో నాదేశపు వాతావరణం మలినం చెయ్యనివ్వను...

వినండి ! వాడు మన నిజమైన శత్రువు–
నాగుండెల్లో బంధించిన క్రూర రాక్షసుల్నందర్నీ వాడిమీదికి విడుదలచేస్తాను; వాడి విధ్వంసంకోసమే నిద్రమేల్కొ ఉంటాను.

దినం సూర్యుడ్ని పూర్తిగా కొల్లగొట్టి తరిమివేస్తే, పాపం! కట్టుబట్టలతో నిష్క్రమించాడు పడమటి పొలాలమీదుగా–

Men meditated and meditated and created a reptile. They tended and brought up the reptile, feeding it liberally on the grain of votes; and hoped they could live happily ever after in the cool shade of its hoods-

Now, the reptile lays eggs of laws regularly; and it often eats its own eggs, it multiplies its race though.

It enjoys and nods its hood at the arts of the snake charmer and hisses and uses its fangs when he drops charms even unwittingly.

Soon, spread the tribe of snake charmers in the country with the ever expanding scope of their profession–

In the end, hardly any space is left for the common people in the country; this now is the history of my land.

My friend, don't you get tears when you look at your country and your fields?

Doesn't hate errupt in your system against those criminals who are plunging daggers into the chest of your harvests? Take census of those martyrs whose lives were taken away in the name of democracy and not of those mean men, who are enjoying their lives in despicable servility.

O my people-

you who are burnt to ashes by the curse of the snakes.. come,

i give you a new poem;

this poem gives you new life;

this poem gives you a new journey,

stop practising the art of snake charmers, get inducted into the noble discipline of killing the snake-

నాగలి అవతలపెట్టి నేను మిగిలిన నా పేదసాయంకాలపు ముక్కలనుంచి ఎట్లాగో ఒక పాట పిండుకుంటున్నాను.

నాకు తెలీకుండానే ఉదయించిన అర్ధచంద్రుడు అప్పుడే నరికిన శిరస్సులా అకస్మాత్తుగా అస్తమించాడు రక్తకాంతులు కక్కుతూ-

ఎంత ప్రయత్నించినా ఒక్క అవులింతకూడా రాత్రిని ఆహ్వానించలేదు. ఒకటి రెండు పేజీలు ద్రాక్షోపనిషత్తు పఠించి, శయ్యతో ఏతర్కమూ పెట్టుకోకుండా, నా అవయవాల్ని దానికి స్వాధీనం చేశాను.

కానీ ఒక భయంకర స్వప్నం!

లాగులూ బుష్‌కోట్లూ ధరించిన శిరస్సుల్లేని భయంకర మానవాకారాలు నాదేశపు పిల్లల్ని చీమలుచేసి సిరాచెరువుల్లో తోసి వెళ్ళిపోతున్నారు, "దేశం మాది" అని అరుస్తూ-

కలలోనించి ఒక్క గంతువేసి దూకాను బయటకి- గాలిని చూచి కిటికీలో జ్వాల గడగడ వణికింది; చీకటి ఇంటిని కబళించింది.

నా స్తంభాల్లాంటి పాదాలు బయట వీథుల్లో మోపాను; మనుషుల అడుగులమీద నిశ్శబ్దం వాలుతోంది; మగతగా నక్షత్ర మండలాలు నిద్దురమత్తులోకి ఒరిగిపోతున్నాయి—

తూర్పు వెతుక్కుంటూ వెళ్ళాను సూర్యుడి తొలికిరణాలు పోగుచేసుకుందామని;

ఊరి పొలిమేరల్లోనే ఆగిపోయిందల్లే ఉంది ఉషస్సు! ఆ తరుణాన్ని ఇక సహించలేకపోయాను!

అరుణాగ్ని ఉమిసే కళ్ళతో నా పిడికిట్లో ఉన్న తుపానుని ప్రపంచంమీదికి ఊదేశాను-

In this country to the bending men are born, men who bend low and also salute.

Rising of this ominous sign in this land heralds great disasters to our population, kill the bending man and the land is rid of all the reptiles at once; sniff his smell in the air and kill him in his mother's womb, for he has no right to breathe my country's air and no right to drink my country's water.

I shall not have him pollute my country's atmosphere with the stink of his breath; remember, he is our real enemy.

I shall let loose on him all the rapacious cannibals enchained in my bosom and i shall banish sleep from my eyes until he is destroyed.

Exploited and banished by the day, the sun walked away by the western fields, barely with the last rags on his body.

I laid aside my plough and was somehow milching my humble song from the remnants of the evening;

A half moon rose without my knowing; suddenly like a head chopped, dropped and disappeared dripping rays of red luminosity-

How much I pulled up myself! Not a yawn rose in me to receive the night-

Skipped one or two pages of the sermon of the grape, and surrendered my limbs to the bed without an argument.

క్షణంలో తూర్పుగుడిసెమీద గొంతెత్తిన ఎర్రటి కోడి పుంజులా లేచాడు సూర్యుడు!

ఒక నవోదయ కిరణం గుచ్చుకుని నా అలసిపోయిన శరీరం మూర్ఛిలింది-

ప్రొద్దుటెండ మా గుమ్మంలోకి వచ్చి తొంగిచూచింది. దినం ఎందుకో తడబడుతూ ఉంది. పడమట ఉదయాన్ని తూర్పున అస్తమయాన్ని ధరించుకుని పరుగెత్తుకు వచ్చింది.

కళ్ళలో ఏదో సంభ్రమం, కాళ్ళలో ఏదో తొట్రుపాటు-

కళ్ళు బెదిరిన పక్షుల్లా ఉన్నాయి, కాళ్ళు రాళ్ళలో ప్రవహించే సెలయేళ్ళలా ఉన్నాయి.

తలవని తలంపుగా చైత్రం బయలుదేరి వచ్చింది- నేనేమో ఆహ్వానించే శక్తి లేని అతిథిని!

దున్ని దున్ని అలిసిపోయి ఒక చెట్టునీడలో మేనువాల్చాను తలపులు గాలిపటాలుగా ఎగరవేస్తూ-

చిన్న పసి ఆకునీడలో ఒక కల అల్లుకుంటూ సేద తీర్చుకుంటున్న పక్షి.

నీలిమలో తేలిపోతున్న ఒక తిరుగుబోతు మబ్బును చూపులతో వెంటాడుతోంది, అదెక్కడికిపోయి కరిగిపోతుందో అక్కడికి తానూ పోయి ఆ లోతుల్లో కరిగిపోదామని-

In a hedious nightmare I saw the children of my country being led away, turned into ants and dropped into oceans of ink by headless human shapes, dressed in pants and bush-shirts!

Rudely jerked I screamed and jumped out of my dream.

The flame in the window looked at the gushing wind and shuddered; titanic darkness swept across and swallowed my house.

I laid my gigantic legs on the roads outside, when footsteps of men were dying away and the great constellations in the sky were setting into drunkenness of sleep.

I went eagerly in search of the East, to gather the first rays of the sun: dawn, seemed to have stopped at the outskirts of my village, I could not stand the moment any longer.

With bloodshot eyes I blew the storm which I was holding in my fist on the world. Next minute, over the hut of the East tapering into the sky, sun rose like a crowing red cock. My tired body, smittem by joy of a morning ray, fainted and fell.

The morning sun came to my door and peeped in; the day appears to be in haste. It came running, wearing the sunrise in the west and sunset in the east.

There is some tremulousness in the eyes and the footsteps are faltering–the eyes seem like frightened birds, legs are like brooks stumbling

తుంటరి చెట్టు ఒంటరిగాఉన్న నామీద ముసలి ఆకులు విసిరేసింది...

అది కటిక చీకటి అమావాస్య- అయినా గగనంలో నక్షత్రాల నగరాలు మేల్కొన్నాయి.

నా మెదడులో భావాల అరణ్యాలకు నిప్పంటుకుంది.

నిద్ర పక్షిఐ పారిపోయింది, జ్వలించే శూన్యానికి తనగూడు విడిచిపెట్టి;

నా కిటికీ ఇనపఊచల కావల ఎక్కడో దూరదూరాల అడవుల్లో వ్యూహాలు పన్నుతున్న చెట్ల సైన్యాలు,

తీవ్రంగా చెలరేగుతున్న తుఫానుల యుద్ధాలు,

క్రోధోద్రేకంతో చతుర్దిశలా పరుగెత్తుతున్న ఉన్మత్త ఝంఝూమారుతాలు,

కొండల శిరాలుదిగి శరీరాలు దిగి ప్రవహిస్తున్న నదుల రుధిరధారలు-

మనుషుల నగరాలూ గ్రామాలూ నిశ్చయం కోల్పోయిన అజ్ఞాన అకస్మాత్తు దశలో నిలువునా కంపించిపోతున్నాయి.

అప్పుడే ఛేదించుకున్న శిరస్సులు చేతుల్లో పట్టుకుని,

శరీరాలు గుడ్డి కాళ్ళతో పరుగులెత్తుతున్నాయి,

శిరస్సులనించి వీథుల్లో రక్తం కారుతుండగా,

over rocks; unexpectedly Chaitra arrived; I am not equal to welcome the celebrated guest!

With exhaustion, after ploughing a long day, I rested the plough and myself beneath a tree letting my thoughts fly high as kites. A bird resting under a small shade of a leaf was following the movement of a gypsy cloud in the skies, eager to know where it would melt in the depths of the blue and with the desire to go there and melt away itself with the cloud.

The mischivous tree threw a shower of old leaves on me.

It is thick amavasya; yet cities of constellations opened their eyes in the skies beyond; vast forests of thoughts caught fire in my mind. Sleep like a bird fled away in fright leaving her nest to fiery vacuum. Away from the bars of my window, in the far far regions of space, in the density of massive forest lands, armies of trees arrayed; war of tempests blowing; winds mad with rage srun amuck in all directions; rivers jump down the heads of mountain ranges, flow down their battered bodies in floods of red blood. Cities, towns, villages of men tremble in ignorant indecision. Bodies run on blind legs holding in their hands their freshly cut heads, blood droping in the streets and their grotesque open teethy mouths shouting curses at the disastrous civilisations. Earth explodes her own body and flings off her limbs into the tumult of furious oceans with a million articulate hands...

In my window, the noise of two raindrops quarelling!

వాటి భయంకర దంతవక్త్రాలు ఉపద్రవ నాగరకతల్ని
శపిస్తూ ఉండగా—

భూగోళం తనని తానే పేల్చుకుని
తన అవయవాల్ని కల్లోలసముద్ర తరంగాల్లోకి విసిరేస్తోంది
సహస్ర బాహువులతో—

నా కిటికీలో రెండు చినుకులు పోట్లాడుకుంటున్న గోల !

Eh, you cropse like creatures, you unsubstantial shadows. Look! vultures are hovering over your cities.

Doaot think that these silent trees have no tongues to speak; only they are sages of silence living on their inner strength...

In your mixed civilisation of hutments and mansions you you are all committing suicides and proclaiming that you are achieving intellectual progress-

Your academic speeches are acts of rape on innocent languages.

The trees that rise outof the burning earth, offer gifts of cool shades to man spontanously.

In the forest haunts where the rule of wind thrives, penance can be made in perfect peace and without loss of human dignity.

In your cities, like the burden of the past, the bullock cart crawls on the back of the modern road, which the shinning motor cars brush past like flashes of lightenings, as if, the vanity of man has acquired four wheels, and lives in supreme indifference to the whispers of leaves, flowers and, to the trees on the sides.

Past and present meet and look at each other in contempt and ridicule on your modern roads.

The value of all created things is dismissed from human sight.

# ఏడో సర్గ

ఓరి వెధవపీనుగుల్లారా! మీ నగరాలమీద గద్దలెగురుతున్నాయి, చూడండి—

మౌనంగా ఉన్న చెట్లకు మాటలు రావనుకున్నారు కానీ అవి అంతఃశక్తిమీద బతికే నిశ్శబ్ద మునీశ్వరులు!

గుడిసెలూ భవనాలూ మేళవించిన మీ కలగాపులగపు నాగరకతలో మీరు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు, ఆత్మదర్శనం అంటున్నారు! మీ ఉపన్యాసాలు మీరు భాషలమీద చేస్తున్న బలత్కార వ్యభిచారాలు—

మండే భూమిలోనించి ఉదయించినా చెట్లు మనిషికి మనఃపూర్వకంగా నీడలిస్తున్నాయి. గాలులు పాలించే అడవుల్లో గౌరవహాని లేకుండా తపస్సులు చేసుకోవచ్చు. మీ నగరాల్లో, మోయలేని ప్రాచీన భారంగా ఆధునిక రస్తా వీపుమీద ఎడ్లబండి కాళ్ళీడ్చుకుంటూ పోతుంది, మెరిసే మోటారుకార్లేమో మెరుపుల్లా పరుగులెత్తుతుంటాయి, నిర్లక్ష్యంగా, దురహంకారానికి చక్రాలు తగిలించినట్లు– ప్రక్కనున్న చెట్లను పట్టించుకోవు. పాతకొత్తలు మీ రస్తాల్లో పరస్పరం హేళనచేసుకుంటున్నాయి. సృష్టివిలువలు దృష్టిపథంనించి గెంటివేయబడ్డాయి.

గాలిలో విమానంతో పోటీపడుతున్న ఆ పక్షి వట్టి పక్షి అనుకోకు; అది నీలి ఎత్తులమీద కూర్చుని, లేస్తూ పడుతూ నడిచే మానవ నాగరకతల్ని పరికిస్తున్న ప్రాచీన పక్షి– ఏ నాగరికతల్ని మనిషి తన గొప్పతనానికి ప్రతీకలుగా పతాకలుగా ఎగరవేస్తున్నాడో చరిత్ర పేజీల్లో, ఆ నాగరికతల్ని పరిశీలిస్తున్న పక్షి!

That eagle, which is competing with the aircraft in the air, is not a mere bird. It is that old ancient bird which watches from the blue heights; the rising and falling civilisations of man,

which he flaunts as the fluttering symbol of his greatness in the pages of history.

Looking at mans repeated classical farce of greatness, mountins roar with laughter,

Sea wears a sardonic smile and the sides of the sky ache with humour,

While the ancient forests, who hold realised souls in their wombs, nod their heads in silent sarcasm.

O man! where are your legs carrying you? your two little legs which bend under the weight of your vain glorious civilisations!

Listen! the storms are howling on the walls of centuries...

మనిషి చేస్తున్న శుష్క ఆర్భాటంచూస్తూ కొండలు వికటాట్టహాసం చేస్తున్నాయి. సముద్రం విశ్వాసవాసనలేని హ్రస్వ హాసంచేస్తోంది. ఆకాశం కడుపు చెక్కలయ్యేట్లు నవ్వుతోంది; జ్ఞానకుక్షులైన పురాతన అడవులు మౌనవ్యాఖ్యలతో తలలు పంకిస్తున్నాయి.

మనిషీ! నిన్ను ఎక్కడికి మోవుకుపోతున్నాయో నీ కాళ్ళు? నీ రిక్త నాగరికతల ఆర్భాటధాటిని మోయలేక వంగిపోతున్న నీ రెండు కాళ్ళు—

శతాబ్దాల గోడలమీద కూర్చుని తుఫానులు అరుస్తున్నాయి. విను !

This song left me years ago and again today has set its foot on the doorstep of my lips,

This valley is knitting our songs; moon has arrived into the window and has again rekindled fires-

Plough has become a cobra in my hands. In the fields, my work has become chains to my legs.

Your speech, a cluster of bees that carry honey, never, leave me-

My heart becomes a river only to flow to you.

My mind becomes a room only to open its doors to you,

Here is the flower which I carried for you from the fields, it is a bird, which craves to build its nest in your hair-

Songs that we together hummed last night have not left clinging to the shrubs as yet,

And those flowers that descended to the earth forgot to return back to the trees,

Moonlight that rained last night in the coconut groves is dribbling from the long palm leaves, I have collected all those drops with my eyes.

I love you as the sun loves the earth. Though at nights I go, I return by morning, to see you and forget myself.

ఈ గీతిక నన్ను విడిచి ఎన్నేళ్ళయింది! మళ్ళీ ఇవాళ నా అధరాల గుమ్మంలో అడుగుపెట్టింది. గాలి పరిమళపు కొంగు పట్టుకొని లాగుతోంది; ఈ లోయ మన పాటలల్లుతోంది; చంద్రుడు నా కిటికీలోకి వచ్చాడు; నా గుండెలో మళ్ళీ నిష్పంటించాడు-

నాగలి నాచేతికి నాగుబాముయింది; పొలంపనులు నాకాళ్ళకు సంకెళ్ళుగా మారేయి. తేనెలు మోసుకువచ్చే తేనెటీగల్లాంటి నీ పలుకులు వదలవు నన్నెప్పుడూ!

నా హృది ఒక నదిఐ నీవైపే పరుగిడుతోంది, నామది ఒక గదిఐ నీకొరకే తన తలుపులు తెరుస్తోంది-

ఇదిగో నీకోసం చేలలో కోసితెచ్చిన పువ్వు; ఆ పువ్వు నీ కురుల్లో గూడుకట్టుకుందామని వచ్చిన రంగుల పక్షి; దానికి నీ నవ్వు అందివ్వు-

రాత్రి మనం కలిసిపాడిన పాటలు ఇంకా పొదల్ని వదల్లేదు; కొమ్మల్నించి నేలకు రాలినపువ్వులు కొమ్మల్లోకి తిరిగి పోనేలేదు-

కొబ్బరి మట్టల్లో కురిసిన వెన్నెల ఇంకా బొట్లు బొట్లుగా కారుతూనే ఉంది; ఆ బిందువులు నీకోసం నా గుండెల్లో పట్టి తెచ్చాను-

సూర్యుడు భూమిని ప్రేమించినంతగా నిన్ను ప్రేమిస్తున్నాను; రాత్రిపోయినా ప్రొద్దున్నే వస్తాను; నిన్నుచూచి నన్ను మరచిపోతాను-

If there is no tree or house, I shall give you the shade of life with my hand.

The rainbow has curved its body over our fields raising our sickles, come let us go

A voice of Shehnoi spurts up in the valleys!

Cries again, wounded in the ruins of human cities. We celebrare marriages in these raped nights of men-

In your hair is annointed the blood red sindoor of our emotions, over which, we together will find our way, into the darknesses of life's journey.

Over these flowers, crushed beneath our bodies in the night of our first awakening, we shall caress the dawn of strange tidings.

From your lips and from your womb, shall be born to my flesh, a generation of dreams, with limbs crammed with the energy of action, who will banish inertia from human countries and grow orchards of prosperity, as the fruits of our love.

The grain of the soil of our bodies, shall be the future seed of hope.

They shall carry our journey further into those distant valleys of Time, veiled beyond our recknoning today- Particles of our beings, to rise again, as men, in the fresh dawns to come.

O beloved,

Though my eyes are full of tears that resound in my being from agonies which you and I have

చెట్టులేకపోతే ఇల్లులేకపోతే పోనీ, చెట్టులాంటి నాచేత్తో నీకు నీడ ఇస్తా-

పొలాలమీద ఇంద్రధనుస్సు వంగింది; రా పోదాం, కొడవళ్ళు దాల్చిన చేతులు ఎగరేస్తూ-

ఆ లోయల్లో షహనాయీ ఒక స్వరం చిందింది; మానవ నగర శిథిలాల్లో అది గాయపడి రోదిస్తోంది; బలత్కార వ్యభిచారానికి గురిఅవుతున్న ఈ రాత్రుల్లో మనం మన వివాహాలు జరుపుకుంటున్నాము-

మన ఇద్దరి హావభావాల రక్తసిందూరం నీ కురుల్లో వెలుతురు చల్లుతోంది; మన జీవన అంధకార ప్రయాణాల్లో ఆ వెలుతురు మనకు దిక్కు చూపిస్తుంది...

అని మన వేడితనువులకింద నలిగిన విరజాజుల రోజులమీద మనమిద్దరమూ కలిసి నిద్దురలేచిన మొదటి ఉదయం; ఆ ఉదయం తెచ్చిన నవీన అరవింద సందేశాలను లాలిద్దాం పరిశీలిద్దాం- నీ అధరాలవించీ నీ గర్భంనించీ నా శరీరానికి పుట్టిన స్వప్నాలతరం అవయవాల్లో అణువణువునా కర్మణ్యతాశక్తి నిబిడీకృతం అయి ఉంది; ఆ తరం మానవదేశాలనించి కార్యహీనతను బహిష్కరిస్తుంది; నాలుగుదిక్కులా పచ్చటి పరిమళాల తోటల్ని పెంచుతుంది, మన ప్రేమఫలాల భారం కొమ్మల్ని వంచుతుంది-

మన శరీరాల క్షేత్రాల్లో పండిన ధాన్యమే మన భావి ఆశాబీజం. వాళ్ళే మనకు ఈనాడు కనిపించని సుదూరకాల తీరాలకు మన ప్రయాణాన్ని కొనసాగిస్తారు. మన ప్రాణాల పరమాణువులైన వాళ్ళే మళ్ళీ మళ్ళీ ఆగామి ప్రత్యూషాల్లో మానవులుగా ఉదయిస్తుంటారు.

ఓ ప్రేయసీ !

నాదేశం నా ప్రజలు యుగ యుగాలుగా అనుభవిస్తున్న బాధల గాథలు, నాకన్నుల్ని అశ్రువులతో అలంకరిస్తున్నాయి. నా

received, and the pains this country and our people have faced, yet, had it not been for the river of patience that runs in your veins silently, I would never have known how to hold back the reins of my maddened fever-

The silences that lie imprisoned within my bosom, would have never known the peace, had it not been for your arms which sheltered my burning days and your flowing hair which absorbed my nights of pain.

My nation, my people, my earth, are all mixed up with you, and in my devotion to you.

In your eyes I see horizons, those new horizons beckoning my feet; I meet those challenges thrown by a cruel century.

I know I shall conquer them, and my words shall conquer them after me.

In the great depths of loving

I have received the distinction of becoming a man.

May,
1975



శరీరాన్ని వ్యధాస్వర ఝరీవేగంతో ప్రతిధ్వనింపజేస్తున్నాయి కానీ నీ రక్తనాళాలు ఒరిసిపారే గంభీర శాంతరసమే నా క్రోధోన్మత్త ఉత్తమాశ్వాలకు కళ్ళెం వేయగలిగింది.

నా గుండెలో చిరకాలంగా బంధింపబడ్డ అశాంత నిశ్శబ్దాలు ప్రశాంతి ఎరిగేవేకావు. నీ బాహువులు నా మండుతున్న దినాలకు ఆశ్రయం ఇవ్వకపోతే, నీ ప్రవహించే శిరోజాలు నా రాత్రుల భగ్ననౌకల్ని మృదువుగా తేల్చి మోసుకునిపోకపోతే ;

నా దేశం నా ప్రజలు నా ధరిత్రి అన్నీ నీలో దర్శిస్తున్నాను, నీ కన్నుల్లో కనిపించే నూతన ప్రాచీరేఖలు నా అడుగుల్ని పిలుస్తున్నాయి; ఈ శతాబ్ది నామీద విసిరేస్తున్న క్రూరమైన సవాళ్ళను ఎదుర్కొంటున్నాయి: వాటిని నేను జయిస్తాను. నాతర్వాత నా అజరామర వాక్యాలు జయిస్తాయి-

ప్రేమ అగాధలోతుల్లో మానవ పదవీగౌరవాన్ని పొందాను!

# Works by Seshendra Sharma

## POETRY

Sohrab. A long poem in Classical Metre based on Mathew Arnold's translation of 'Sohrab & Rustom 'from the Shahnama, printed in 1951. The foreword is by Venkata Parvatishwar Kavulu.

Ritu Ghosh. (Cry of the Seasons) A long poem published in 1963. Foreword by Kavi Samraat Sri Vishvanatha Sathyanarayana (The Recipient of Juana Pitha Award). Translated into English by Indira Devi Dhanrajgir. Telugu/English text.

Pakshulu. (The Birds) a collection of poems Printed in 1969.

Cqampoo Vinodini. Humorous and satirical poems published in 1968.

Padavalu Kerataalu. Telugu translation of Beaudelaire's poems Published by The Indian Languages Forum, Hyderabad 12.

Seshajyotsna. Collection of poems, rendered into English by Indira Devi Dhanrajgir, translated into Urdu by Dr. Gias Siddiqi with Hindi transliteration. published in 1972 by The Indian Languages Forum, Hyderabad 12.

Mande Suyrudu. (The Burning Sun) colleetion of peoms which in its epic theme celebrates labour as its hero. Translated into english by the poet, and into Hindi by Om Prakash Nirmal. published by The Indian Languages Forum, Hyderabad 12. Telugu/English text.

Prapancha Kavita-Telugu translations of leading poets of the world (in print).

Naa Desam Naa Prajalu (My Country – My people) first modern epic of Telugu "which has an unrivalled place among the modern epics of the world." Telugu/English Text. This Indian masterpiece is translated into Hindi by Om Prakash Nirmal and into Urdu by welknown critic-poet Akhtar Hasan. Printed by the Indian Languages Forum, Hyderabad-12.

## PLAY

Mabbullo Darbaru. (The Court in The Clouds) printed in 1958, now in second edition. Translated into Urdu by Qutub Sarrhar, published by The Indian Languages Forum, Hyderadad 12.

## SHORT STORY

Vihwala. (The Agonised) collection of short stories, first printed in 1968 now in second edition. Translated into Urdu by Qutub Sarshar, published by The Indian Languages Forum, Hyderabad12.

## LITERARY CRITICISM

Shodasi. A revaluation of Valmiki's Epic Ramayana printed in 1965. The foreword is by Gunderao Harkare. Translated into Hindi by Sekhar and published by The Indian Languages Forum, Hyderabad 12.

Swarna Hamsa. (The Golden Swan) an interpretation of Harsha Bhatta's Samskrit Classic Naishadhiya Charita, published in 1967.

Sahitya Kaumudi. (The moonlight of Literature) collection of literary essays on classical Telugu Poets and their works, published in 1968.

Kavitvam Paaripoyindi–an assessment of techniques, sources and trends, prevailing in Telugu Poetry (in print).

## SCIENCE & OTHER ESSAYS

Narudu Nakshatralu. (Man & Stars) a collection of essays published in 1963.

Oohalo. (Thoughts) collection of eight essays, published in 1969.

Vishva Vivechana. (A Study of The Universe) first printed in 1963, now in second edition. Published by The Indian Languages Forum, Hyderabad 12.

## NOTE BOOK

Rakta Rekha. The Poet's Note Book, a very expressive book which is a window to his mind. Published by The Indian Languages Forum, Hyderabad-12. Telugu/English text.

## BOOKS IN ENGLISH

Meghdoot. (The Cloud Messenger) English translation of Kalidasa's famous Classic, done jointly with Indira Devi Dhanrajgir Published by The Indian Languages Forum, Hyderabad 12

Relationship of Meghdoot with The Epic Ramayana. A research work done jointly with Indira Devi Dhanrajgir. Published by The Indian Languages Forum, Hyderabad-12.